





# వ్యక్తిత్వ వికాసం

## సైకాలజీ,జ్ఞాపక,మానసిక శక్తి

## మేధో వికాసం





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020120029370



**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

Subject

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

Language

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# ముందుమాట

అనంతకోటి విశ్వాన్ని, అందులోని అణుమాత్రమైన మనను నిర్దేశించే, నిర్వచించే సూత్రాలున్నాయనేది సామాజిక విజ్ఞాన శాస్త్రం తిరుగులేకుండా రుజువు చేసిన విషయం. అయితే అంతమాత్రాన మానవ జీవితమంతా విధిరాత, ఖర్మ అని నా ఉద్దేశం కాదు. విశ్వజనీన నియమాలను అర్థం చేసుకుని, అమలులో పెట్టడం ద్వారానే మనం నిజమైన స్వేచ్ఛా జీవులం కాగలం. "నా ముక్కు కొన ఆరంభమైన చోటే నీ స్వేచ్ఛ అంతమవుతుంద"నే ఆంగ్ల సామెత జగద్విదితం.

'మానవుడు సంఘజీవి' అని పలువురు తత్వవేత్తలు ఘోషించిన అంశాన్ని నేను ప్రగాఢంగా విశ్వసిస్తున్నాను. అందుచేతనే నేడు ప్రధాన స్రవంతిగా వున్న వ్యక్తిగత వికాస సాహిత్యం విస్మరించిన పలు సామాజిక అంశాలను, సూత్రాలను ప్రస్తావించడమే నా ఈ చిన్న పుస్తకపు పెద్ద ఉద్దేశం.



అయితే నేడు మార్కెట్‌లో వున్న వ్యక్తిగత వికాస సాహిత్యాన్నంతటినీ కొట్టి పారేయడం నా ఉద్దేశం కాదు. కానీ నేను ఈ పుస్తకంలో పేర్కొన్నట్లు కేవలం వ్యక్తిగత *(Invidualistic)* ధోరణులతో కూడుకున్న ఏ సూచనలూ తమ లక్ష్యాన్ని పరిపూర్ణంగా సాధించలేవు. మన చుట్టూ

వున్న సమాజ దర్పణంలో మనని మనం నిరంతరం చూసుకుంటూ, బేరీజు వేసుకుంటూ వుంటాం. సమాజంతో సంబంధంలేని 'టార్జాన్' వంటి ఒంటరి మానవులుగా మనం మనుగడ సాగించలేం. అందుచేత మనకు అస్తిత్వాన్ని, అర్థాన్ని కల్పించిన సమాజంపట్ల నిరంతర అంకితభావం లేకుండా మనం పరిపూర్ణ మానవులం కాలేము.

కాగా నేను ఈ పుస్తకంలో అడ్డదోవ పద్ధతులుగా పేర్కొన్న కొన్నింటిని కూడా పాఠకుని విస్తృత ప్రయోజనాలకై అక్కడక్కడ ప్రస్తావించాను. ఇవి మొత్తం వ్యక్తిత్వాన్ని వికసింపచేసుకునే బృహత్ వ్యూహానికి పనికివచ్చే ఎత్తుగడలు లేదా పనిముట్ల వంటివని నా ఉద్దేశం.

వ్యక్తిత్వ పరిణతివైపు మీ పయనంలో ఈ పుస్తకం దిక్సూచిగా, కరదీపికగా వుండాలనేదే నా ఆకాంక్ష. అయితే మీ వ్యక్తిత్వ వికాస పయనం బాధ్యత అంతిమంగా మీ చేతుల్లోనే వుంది. ఈ పుస్తకాన్ని మళ్లీ మళ్లీ "అధ్యయనం" చేయండి. నేను పైపైన తడిమిన అంశాలను కూడా సీరియస్‌గా తీసుకుని మీ స్వంత ఆలోచనలు, స్వీయ పరిశీలనతో మీ మార్గాన్ని నిర్దేశించుకోండి.



శుభాకాంక్షలతో

**డి. పాపారావు**

# ఈ క్రమంలో ...






# నూతన దృక్పథం

వ్యక్తిత్వాన్ని పరిపూర్ణం చేసుకోవడానికి సంబంధించి సూచనలు చేస్తూ పలు వ్యాసాలు, పుస్తకాలు మార్కెట్లో అందుబాటులోకి వస్తున్నాయి. ఈ వరవడి ఈ మధ్య కాలంలో బాగా పెరిగిపోయింది. గతంలో వలె కాక, నేటి యువతరం వ్యక్తిత్వ అభివృద్ధికి కీలక ప్రాధాన్యతనిస్తోంది. అయితే నేడు మనం మన చుట్టూ వున్న సమాజాన్ని పరిశీలిస్తే ఎంతమంది

*యువకులు లేదా యువతులు, ఆసక్తి ఉన్నవారు పుస్తకాలను చదివి తమ వ్యక్తిత్వాన్ని ఇనుమడింప జేసుకుంటున్నారనేది ప్రశ్నార్థకంగానే మిగులుతుంది.*

ఈ పై అంశానికి సంబంధించిన లోతుపాతులకెళితే మనకు ఒక విషయం బోధపడుతుంది. అది సమస్యలు రెండు రకాలనీ, ఒకరకం సమస్యలు ప్రాథమిక, మౌలిక, సాధారణ సమస్యలు కాగా; రెండవ రకం సమస్యలు ఈ సాధారణ సమస్యల నుంచి పుట్టుకొచ్చే లేదా ఉద్భవించే సెకండరీ సమస్యల తాలూకు అంశాలు.

నేటి వ్యక్తిగత వికాస సాహిత్యంలోని ప్రధాన స్రవంతి ఈ రెండవరకం సమస్యలపై ప్రధానంగా తన దృష్టిని కేంద్రీకరిస్తుంది. అంటే ఈ సాహిత్యం వ్యాధి మూలానికి కాక దాని లక్షణాలకు మందు వేసే వైద్యం వంటిది. కాగా ఒక ప్రఖ్యాత తత్వవేత్త చెప్పినట్లు, ముందుగా సాధారణ సమస్యను పరిష్కరించకుండానే దాని నుంచి పుట్టుకొస్తున్న సెకండరీ సమస్యలకు పరిష్కారం వెతకటం శుష్క ప్రయత్నం. ఎందుచేతనంటే సాధారణ సమస్య అనే మూలాన్ని పెకిలించి, మార్చకుండా ఉన్నంతకాలం అది పైన పేర్కొన్న రెండవరకం సెకండరీ సమస్యలను సృష్టిస్తూనే వుంటుంది.

ఉదాహరణకు ఒక వ్యక్తి తన ఆలోచనలలో వెసులుబాటుతనం (Flexibility) లేనివాడు అనుకుందాం. ఇటువంటి వ్యక్తి జీవితంలో మంచి స్నేహాల కోసం లేదా కెరీర్‌లో పురోగతి కోసం చేసే ప్రయత్నం ఏదో ఒక దశలో ఎదురుదెబ్బ తింటూనే వుంటుంది. ఆ వ్యక్తి కేవలం మానవ సంబంధాల పైపూతలలో విజయానికి తాపత్రయపడితే అది నిష్ప్రయోజనమే అవుతుంది. అలాగే అతను నేటి మానవ నాగరిక

*బహిర్గత ప్రపంచంలో నీవు చూడదలుచుకున్న మార్పుకు, ముందుగా నీలో నీవు శ్రీకారం చుట్టాలి.*
*- మహాత్మా గాంధీ*

సమాజంలో నిరంతరం మార్పులకు లోనయ్యే ఏ ఉపాధి రంగంలోనూ విజయవంతంగా ముందుకు వెళ్లలేడు. అందుచేత ఈ వ్యక్తి మౌలిక, సాధారణ సమస్య అయిన వెనులుబాటుతనం లేకపోవటాన్ని అధిగమించకుండా పైపై మార్పులతో జీవితంలో వ్యక్తిత్వ వికాసాన్ని సాధించలేడు.

వ్యక్తి తనలోని ఈ ప్రాథమిక, మౌలిక సమస్యలను అధిగమించి పురోగమించడానికి అవసరమైన నూతన తాత్విక దృక్పథాన్ని అందించే ప్రయత్నమే ఈ పుస్తక సారం.

ఈ మౌలిక, ప్రాథమిక సమస్యలలో కీలకమైనది, ప్రధానమయినది వ్యక్తిగత మార్పులో లేదా పరిణతిలో సమాజం-వ్యక్తికి మధ్య గల అంతః సంబంధం.

ప్రధానంగా వ్యక్తిత్వ అభివృద్ధికి గురిపెట్టబడ్డ సాహిత్యంలో హెచ్చు మోతాదు కేవలం ఒక వ్యక్తిని మాత్రమే విడిగా తీసుకుని ఆ వ్యక్తి వికాసానికి మార్గాలను సూచిస్తోంది. ఇక్కడ ఒక ప్రధాన సామాజిక అంశం విస్మరించబడుతోంది. తుది పరిశీలనలో వ్యక్తిత్వం సామాజిక సంబంధాల పరాకాష్టగా ఏర్పడుతోందని మనం గుర్తించాలి. ఒక వ్యక్తి తన వ్యక్తిత్వాన్ని తనకు నచ్చిన, తను మెచ్చిన రీతిలో మలుచుకోవాలంటే అతను లేదా ఆమె సామాజిక సంబంధాలను విస్మరించరాదు.

ఉదాహరణకు ఒక వ్యక్తి జన్మించిన మరుక్షణమే మానసిక అస్తిత్వాన్ని, గుర్తింపును కలిగి వుండడు. ఈ గుర్తింపు కాలక్రమేణా అతనికి లేదా ఆమెకు చుట్టూ వున్న తల్లిదండ్రులు, బంధువులు, మిత్రవర్గాలు, సమాజం ఆపాదిస్తాయి. అంటే ఆ బిడ్డకి తల్లినని చెప్పడం

మనం కేవలం విడి వ్యక్తులుగా జీవించలేము. మనలను మన సాటి మానవులతో వేలాది జీవితపు దారపు పోగులు అనుసంధానిస్తుంటాయి. - హెర్మన్ మెల్‌విల్లే

ద్వారా తల్లి, అలాగే యితరులు తల్లి ద్వారా గాని మరే రకంగా గానీ, తమ బాంధవ్యాన్ని ఏర్పరచుకోవడం ద్వారా ఆ బిడ్డ ఒక సామాజిక సంబంధాల క్రమం (నెట్‌వర్క్)లో తన నిర్వచనాన్ని (గుర్తింపును) పొందుతాడు. అంటే ఆ బిడ్డ తన చుట్టూ వున్న సమాజంతో పరస్పరం నిర్వచించుకునే ఒక ప్రక్రియలో భాగమవుతాడు. దీని అర్థం బిడ్డ సమాజం చేత నిర్వచించబడుతూనే అదే సమయంలో సమాజంలో తన చుట్టూ వున్న వారికి కూడా నిర్వచనాన్ని యిస్తాడు. కాబట్టి ఈ మొత్తం వ్యక్తిత్వం నిర్వచన ప్రక్రియను దృష్టిలో పెట్టుకోకుండా వ్యక్తిగత అభివృద్ధికి చేసే ఏ సూచనలైనా, యిచ్చే ఏ సలహాలైనా ఒట్టి డొల్లలుగానే మిగులుతాయి.

ఈ నేపథ్యంలో ఏ వ్యక్తి అయినా తన వ్యక్తిత్వానికి మరింత మెరుగులు దిద్దుకోవాలంటే లేదా పరిపూర్ణంగా మార్పు చెందాలంటే ఈ క్రింది ప్రక్రియను అనుసరించవలసి వుంటుంది.




పై విశ్లేషణా చిత్రంలో చూపిన విధంగా ఒక వ్యక్తి 'X'గా నిర్వ

ప్రతి వ్యక్తిలోనూ ఒక విధి నిక్షిప్తంగా వుంది. దానికి అతనే యజమాని.
- జాన్ లాక్

చించబడి వున్నాడనుకుందాం. అయితే అతను లేదా ఆమె స్వతంత్రంగా ఆలోచించుకో గలిగే స్థాయికి ఎదిగిన తరువాత "XY" గా నూతన వ్యక్తిత్వాన్ని పొందాలనుకున్నాడని అనుకుందాం. ఈ ప్రక్రియలో ఆ వ్యక్తి పైన చూపినట్లుగా ఒక శూన్యం నుంచి ప్రయాణించవలసి వుంటుంది. అంటే ఆ వ్యక్తి తన పాత వ్యక్తిత్వాన్ని పరిపూర్ణంగా పరిత్యజించి నూతన వ్యక్తిత్వాన్ని పొందగోరే ప్రక్రియలో సహజంగానే, అతని చుట్టూ వున్నవారి గుర్తింపు, వ్యక్తిత్వాలు కూడా ప్రశ్నార్థకంగా మారతాయి. అంటే అతని చుట్టూ వున్న వారి గుర్తింపులు కూడా సంక్షోభానికి లోనవుతాయి. దానివలన వారు ఈ వ్యక్తిలోని మార్పులను తీవ్రంగా వ్యతిరేకించడం లేదా గుడ్డిగా తిరస్కరించడం చేయవచ్చు. దీనివలన మార్పును కోరుకుంటున్న వ్యక్తి వ్యక్తిగత సంబంధాలలో ఒడిదుడుకులకు, ఒత్తిళ్లకు లోనవుతాడు. దీనితో ఆ వ్యక్తి దరిదాపుగా ఒంటరై శూన్యంలో చిక్కుకుంటాడు. ఇది ఏ వ్యక్తి ఆమోదించుకోలేని, భరించలేని పరిస్థితి.

ఈ కారణం వల్లనే సరైన అవగాహన లేకుండా వ్యక్తిత్వ పురోగతికి ప్రయత్నాలు చేసే పలువురు తిరిగి తమ పాత వ్యక్తిత్వంతో రాజీ పడిపోతారు. శూన్యం గుండా ప్రయాణించే మార్గాలను, ప్రక్రియను సరిగా అర్థం చేసుకోకుండా అన్వేషించకుండా వ్యక్తిత్వ అభివృద్ధి అసాధ్యం. అయితే సరైన శాస్త్రీయ పంథాలో వ్యక్తిత్వ అభివృద్ధికి కృషి చేసిన వ్యక్తి తను కోరుకున్న నూతన వ్యక్తిత్వాన్నే పరిష్కారంగా పొందడం ద్వారా నూతన సామాజిక, వ్యక్తిగత సంబంధాలను ("XY స్థానంలో") పొందగలడు. అంటే అతను లేదా ఆమె విజయవంతంగా పరివర్తన చెంది నూతన గుర్తింపును (identity) పొందగలరు.

దీనితో పాటుగా పలువురు వ్యక్తులు వ్యక్తిత్వ అభివృద్ధికి కృషిచేసే

> నిర్ణయాత్మక మహాయుద్ధాలన్నీ జరిగేది మానవుని మస్తిష్కంలోనే.
> - షెల్డన్ కాప్

దశ ప్రధానంగా యౌవనం. ఈ దశలో సాధారణంగా వ్యక్తులలో ఆవేశం, ఆలోచన కంటే అధిక స్థాయిలో వుంటుంది. దీనితోపాటుగా ఈ దశలో గుర్తింపు తాపత్రయం (identity crisis) అధికంగా వుంటుంది. దీనివలన పైన పేర్కొన్న శూన్యం నుంచి ప్రయాణించడానికి కావాల్సిన హేతుబద్ధత, విజ్ఞానం, స్వావలంబన తక్కువగా వుంటాయి. ఈ మొత్తం పరిస్థితి వ్యక్తిగత వికాసానికి ప్రధాన ఆటంకంగా నిలుస్తుంది. కాగా ఒక వ్యక్తి మధ్యవయస్సులోకి ప్రవేశించే నాటికి అతనిలో స్థిరమైన, బలమైన అభిప్రాయాలు, భావాలు ఏర్పడిపోతాయి. ఈ కారణం చేత ఈ వయస్సులో మార్పు మరింత సంక్లిష్టమవుతుంది.

అందుచేత ఆవేశం అధికంగా వున్న యౌవనంలో వ్యక్తి తన వ్యక్తిత్వ మార్పుకు సరైన వ్యూహాన్ని అనుసరించాలి. అంటే ఆవేశం ప్రభావం క్రింద ఆలోచనా ప్రక్రియను నడిపి, తద్వారా ఏర్పడిన అసంబద్ధ, పాక్షిక సత్యాలు లేదా ఒంటెద్దు ధోరణులను మధ్యవయస్సులో తన భావజాలంగా ఏర్పరచుకునే పరిస్థితిని దరిచేరనీయరాదు. యౌవనంలోనే క్షుణ్ణమైన అధ్యయనం (వ్యక్తిత్వ అభివృద్ధికి సంబంధించిన అడ్డదోవ మార్గాలను సూచించే సాహిత్యాన్నే కాక) ద్వారా మరియు తన వ్యక్తిగత సంబంధాలను (peers) సరైన దిశలో మార్చుకోవడం ద్వారా వ్యక్తిగత మార్పునకు కావాల్సిన సాధన సంపత్తిని సమకూర్చుకోవాలి. ఇది మాత్రమే వ్యక్తిగత పరిణతిలో పైన పేర్కొన్న శూన్యం ద్వారా ప్రయాణాన్ని సుగమం చేయగలదు. అంటే వ్యక్తి ఆవేశం ప్రభావంలో ఆలోచించేవాడిగా కాక, ఆలోచన ప్రభావం కింద ఆవేశాలను నడుపుకో గలిగినవాడిగా మారాలి.

వ్యక్తిత్వం అనేది అనివార్యంగా ఆవేశం, ఆలోచనల సమ్మేళనంగానే వుండి తీరుతుంది. ఇది నిర్వివాద శాస్త్రీయ సత్యం. అందుచేతనే

జీవితంలో నిజమైన ప్రయాణం, వ్యక్తి తన మనస్సులో తాను అంతర్గతంగా జరిపే ప్రయాణమే. – రైనర్ మెరియా రిల్కే

ఆవేశం, ఆలోచనల్లో ఏది ప్రధాన వాహకంగా వుండాలనే ప్రశ్న ముందుకు వస్తుంది. *ఆవేశపూరిత ఆలోచన స్థానంలో ఆలోచనాపూరిత ఆవేశాన్ని ఏర్పరచుకోకుండా ఏ వ్యక్తి వ్యక్తిగత అభివృద్ధిని సాధించలేడు.*

మరో రూపంలో చెప్పుకోవాలంటే హెచ్చుమంది మానవులలో కుడి ప్రక్కన వున్న మెదడు భాగం చిత్రాల ద్వారాను (pictures), ఎడమ పక్కనున్న మెదడు భాగం మాటల ద్వారాను (words or language) తన విధులను నిర్వహిస్తుంది. ఉదాహరణకు 'ఇల్లు' అనే ఒక మాటనే తీసుకుందాం. ఈ మాటను ప్రేరకంగా ఇస్తే దీనికి ప్రతిస్పందనగా ఒక్కో వ్యక్తి మెదడులో ఒక్కో రకమైన ఇంటికి సంబంధించిన చిత్రం కదలాడుతుంది. ఇది ఆ వ్యక్తి తన జీవితంలో గత అనుభవాలపై ఆధారపడి వుంటుంది. అంటే జీవితంలో మనం వాడే ప్రతి మాటా మన ఎదుటివారిలో ఒక్కొక్కరికి ఒక్కో అర్థాన్ని కల్పిస్తుంది. అయితే టీవీ, సినిమాల వంటి దృశ్య సాధనాలు విస్తృతంగా వ్యాపించాయి. దీనివలన సమాజంలోని వ్యక్తులందరూ దరిదాపుగా ఒకేరకమైన దృశ్య సంబంధిత ప్రభావాలకు లోనవుతున్నారు. దీనితో సమాజంలో వ్యక్తులు ఒకరికొకరు భిన్నంగా మరియు సృజనాత్మకంగా ఆలోచించే పరిస్థితి తగ్గి, మూసపోత ఆలోచనలు వ్యాపిస్తున్నాయి. దీనితో మనం ఎంతగా వ్యక్తిగతవాదులము(individualists) అవుతున్నా, తుది పరిశీలనలో మానవ సమాజంలోని వ్యక్తులు, ముఖ్యంగా యువతీ, యువకులు మరింత సామాజిక మూసపోతకు లోనవుతున్నారు. ఇది కూడా వ్యక్తిగత అభివృద్ధికి కావలసిన ముడిపదార్థాన్ని, పరిస్థితులను వక్రీకరిస్తోంది. యావత్తు సమాజంలో వ్యక్తి సృజనాత్మకతకు కావాల్సిన పునాదులు కుంచించుకుపోయి నిస్తేజత ప్రబలుతోంది. అంతర్గత మానసిక

*జీవితం ఒక సాహసోపేత కృత్యం, లేదా అది శూన్యం మాత్రమే.*
*- హెలెన్ కెల్లర్*

పరిపుష్టతకు ప్రాధాన్యత తగ్గి కేవలం భౌతిక సంపదలు, ఆనందాల పట్ల వ్యామోహం పెరుగుతోంది. ఈ విధంగా మానసిక పరిపుష్టత లోపించిన ఏ వ్యక్తి అయినా వ్యక్తిగత పురోభివృద్ధిని, మార్పును సాధించడం అసాధ్యం. ఇది పైన చెప్పిన శూన్యంలో ప్రయాణానికి సంబంధించిన అంశం.

వ్యక్తిగత వికాసంలో విజయం సాధించాలంటే శూన్యం గుండా ప్రయాణించడానికి కావలసిన ఆత్మబలం కావాలి. దీనికి శాస్త్రీయ ధృక్పథం గల తత్వశాస్త్రాన్ని అధ్యయనం చేయటం తప్పనిసరి. తగిన తత్వబద్ధ పునాది లేకుండా అడ్డదోవ పద్ధతుల ద్వారా ఎవ్వరూ వ్యక్తిగత వికాసాన్ని సాధించలేరు. తగిన మనోబలం, తత్వశాస్త్ర పునాది వున్న తరువాత మాత్రమే ఏ వ్యక్తి అయినా ప్రస్తుతం మార్కెట్‌లో వున్న పలు వ్యక్తిగత అభివృద్ధి సాధన పుస్తకాలను సక్రమంగా వినియోగించుకోగలడు. అందుచేత వ్యక్తిగత వికాసానికి ముందస్తు షరతు మానవజాతి సృష్టించిన తత్వశాస్త్ర విజ్ఞాన ఖజానాలో తనకు సాధ్యమయినంత భాగాన్ని లోతుగా అధ్యయనం చేయటం. కాబట్టి *వ్యక్తిగత వికాసాన్ని, పురోభివృద్ధిని సాధించుకోవాలనుకునే ఏ వ్యక్తి అయినా నిరంతర అధ్యయనాన్ని నినాదంగా చేసుకోవాలి.* లేని పక్షంలో ముందు పేర్కొన్న శూన్యం ద్వారా ప్రయాణం అసాధ్యం. ప్రపంచంలో, జీవితంలో అనితర సాధ్యాలుగా కనపడే ఏ వ్యక్తి విజయాలను తీసుకున్నా అతని వెనుక నిక్షిప్తంగా ఒక తాత్విక భావన వుండి తీరుతుంది.



> *జీవితంలో అత్యున్నతమైనది ప్రతిదీ మూడు దశలను ఎదుర్కొంటుంది : అపహాస్యం, చర్చ, ఆమోదం.*
> *– జాన్ స్టువర్ట్ మిల్*






# స్వేచ్ఛ - వ్యక్తిగత వికాసం

స్వేచ్ఛకు సంబంధించి పలువురిలో ముఖ్యంగా నేటి యువతరంలో పలు దురభిప్రాయలు వున్నాయి. కేవలం డబ్బు ఉండటాన్ని, భౌతిక భోగలాలసత్వాన్ని మాత్రమే స్వేచ్ఛగా భావించే అసహేతుక పరిస్థితి నెలకొని వుంది. ఈ కంజ్యూమరిస్ట్ ధోరణి తాలూకు స్వేచ్ఛ వాస్తవానికి మనిషిని మానసికంగా ఎదగనీయదు. తన అస్థిత్వంలో భద్రతా రాహిత్యానికి లోనయ్యే వ్యక్తులు, తమ చుట్టూ సిరి సంపదలను, వస్తు సముదాయాన్ని పోగు చేసుకోవటం ద్వారా ఈ అభద్రతా భావాన్ని

అధిగమించుస్తున్నారు. అయితే ఈ పోటీ ప్రపంచంలో శృతిమించిన భౌతిక సంపదల సముపార్జనా తాపత్రయం మనిషిని విముక్తి చేయలేదు. కాగా పోగా ఈ పోటీ ఇతరులతో పోల్చుకునే మనస్థత్వం వ్యక్తిని మరింత అభద్రతా భావానికి గురిచేస్తుంది. ఇది వ్యక్తిగత స్వేచ్ఛ తాలూకు నిజమయిన సారం యొక్క వక్రీకరణ.

పై వాదనకు ఉదాహరణగా ఇద్దరు మిత్రులు ట్రెక్కింగుకు వెళ్లి ఒక కారడవిలో చిక్కుకు పోయారనుకుందాం. ఆ అడవి నుంచి ఎలా బయటపడాలో తెలియని పరిస్థితిలో ఉన్నారనుకుందాం. ఈ స్థితిలో వీరిలో ఒకరు తాను స్వేచ్ఛా మానవుడినని, తన యిష్టమైన రీతిగా అడవినుంచి బయటపడే మార్గాన్ని ఎంచుకోగలనని భావించాడు. కాగా రెండో వ్యక్తి ప్రకృతిలో కొన్ని నియమనిబంధనలు సూత్రాలు వున్నాయని భావించి ఆ అడవినుంచి బయట పడేందుకు సూర్యచంద్రుల స్థానాల కనుగుణంగా నిర్ణయం తీసికోవాలనుకొన్నాడు. అంటే అతను ప్రకృతి నియమాలకు లోబడి తన మార్గాన్ని ఎంపిక చేసుకోవాలని నిర్ణయించు కొన్నాడు.

పై ఇరువురిలో ఎవరు ఖచ్చితంగా అడవినుంచి బయట పడేందుకు ఎక్కువ అవకాశాలున్నాయో మనం వేరే ఆలోచించనవసరం లేదు. ప్రకృతి నియమాలకు లోబడి ప్రవర్తించిన వ్యక్తికే ఆ కారడవినుంచి సజీవంగా బయటపడే అవకాశాలున్నాయి. ఈ ఉదాహరణ మన జనారణ్యానికి కూడా వర్తిస్తుంది. మన నాగరిక సమాజంలో విజయవంతంగా జీవితంలో ముందుకు దూసుకు వెళ్ళాలంటే, ఈ సమాజానికి కూడా కొన్ని నియమనిబంధనలు, సూత్రాలు వర్తిస్తాయని గుర్తించిన వారికే అది సాధ్యం. అలా కాకుండా వ్యక్తిగత స్వేచ్ఛ

*ఆమోదించి, గౌరవించటం ఎందుచేతనంటే, అలా చేయడం ద్వారా మాత్రమే మనం పరిస్థితులను దాటి ఎదగగలం.* - గేథే

# అంచెలంచెలుగా

## విశ్వ నియమాలు



భ్రమలో విశృంఖలంగా ప్రవర్తించే వ్యక్తి స్వేచ్ఛారహితుడిగానూ, చివరకు వైఫల్యం చెందే వాడిగానే మిగిలిపోతాడు. ఈ వాదనను బలపరచేందుకు భౌతికవాద తత్వశాస్త్రం యిచ్చే ఒక ప్రాథమిక సూత్రాన్ని చూద్దాం.

## అంచెలంచెలుగా విశ్వ నియమాలు

ఈ చిత్రాన్ని చూస్తే మనకు నాలుగు స్థాయిలలో వున్న విశ్వజనీన శాస్త్ర నియమాలు అర్థం అవుతాయి. వీటిలో భౌతికశాస్త్ర నియమాలు ప్రాథమిక మైనవి. అంటే ఈ నియమాలు విశ్వం అంతా వర్తించేవి. ఉదాహరణకు ప్రతి చర్యకూ ప్రతిచర్య వుంటుందనే న్యూటన్ సూత్రీకరణనే తీసుకోవచ్చు. భౌతిక ప్రపంచంలో భూమ్యాకర్షణ వంటి వస్తుజాలం మధ్య పనిచేసే యితర నియమ నిబంధనలు వున్నాయి. భౌతిక ప్రపంచంలోని వస్తుజాలం అంతా ఈ నిబంధనలకు లోబడే పనిచేస్తుంది.

తరువాత స్థాయిలో రసాయన శాస్త్ర నియమాలున్నాయి. ఇవి భౌతికశాస్త్ర నియమాలకంటే ఒక అంచెపైన వున్నవి మరియు మరింత సంక్లిష్టమైనవి. రసాయన శాస్త్ర నియమాలలో అంతర్భాగంగా దాని క్రింది స్థాయిలోని భౌతికశాస్త్ర నియమాలు పనిచేస్తుంటాయి. అందుచేతనే మనకు రసాయన శాస్త్రంలో భౌతిక రసాయన శాస్త్రం (physical chemistry) ఒక భాగంగా వుంది. ప్రతి రసాయన ప్రక్రియలోనూ ఆ రసాయనాల తాలూకు అణువుల కదలిక ప్రధానంగా వుంటుంది. అయితే అంత మాత్రాన రసాయన శాస్త్ర నియమాలను భౌతికశాస్త్ర నియమాలకు కుదించలేము. భౌతికశాస్త్ర నియమాలను తనలో అంతర్భాగంగా దాచుకుంటూనే రసాయన శాస్త్రం దానికంటే ఒక అంచెపైనున్న, మరింత సంక్లిష్టమైన శాస్త్రంగా వుంటుంది.

> *నీ జీవితంలో నీవు చేసే ప్రతిపనీ ఒక విశ్వజనీన సూత్రంగా మారుతుందన్న భావంతో నీ జీవితాన్ని నడుపుకో.*
> — హెన్రీ డేవిడ్ థోరో

మరో అడుగు పైకి వెళ్లి చూద్దాం. అక్కడ మనం జీవజాల నియమ శాస్త్రాన్ని (జీవశాస్త్రాన్ని) చూస్తాం. జీవశాస్త్రం భౌతిక రసాయన నియమాలను కలిగి వుంటుంది. అంటే జీవశాస్త్రంలో భౌతిక, రసాయన శాస్త్ర నిబంధనలూ, సూత్రాలూ నిక్షిప్తంగా వుంటాయి. అంత మాత్రాన మనం ఒక జీవిని భౌతిక సూత్రాలకో లేదా రసాయన సూత్రాలకో కుదించలేం. ఈ ప్రయత్నం చేసిన మరుక్షణం ఆ జీవి తన జీవాన్ని కోల్పోతుంది. అంటే జీవశాస్త్రంలో భౌతిక రసాయన శాస్త్ర నియమాలు వున్నమాట నిజమయినప్పటికీ, ఆ శాస్త్రంలో ఈ రెండు శాస్త్రాలకు అందని మరింత సంక్లిష్ట, ఉన్నతమయిన నియమాలు పని చేస్తున్నాయి.

ఇక అత్యంత ఉత్కృష్టమయిన మానవ సమాజాన్ని ఈ నేపథ్యంలో చూద్దాం. మానవ సమాజం పలువురు విడివిడి మానవుల (జీవజాలాల) సమ్మేళనం. అంటే పైన పేర్కొన్న తర్కాన్నే కొనసాగిస్తే సామాజిక శాస్త్ర రంగంలో దాని క్రిందివయిన మిగతా మూడు (భౌతిక, రసాయన, జీవశాస్త్ర) శాస్త్రాల తాలూకు నియమాలు పనిచేస్తాయి. అయితే సామాజిక శాస్త్రాన్ని కేవలం ఈ మూడు శాస్త్రాల నిబంధనలకే కుదించలేం. అది మరింత పరిపూర్ణమైనది. సంక్లిష్టమయినది.

దీనంతటిని బట్టి సమాజంలో కూడా కొన్ని విశ్వజనీన ప్రాకృతిక సూత్రాలు పనిచేస్తున్నాయని మనం గుర్తించాలి. ఈ మౌలిక అంశాన్ని విస్మరించిన వారు ఎవరయినా జీవితంలో విజయం సాధించలేరు. సామాజిక నియమాలను అర్థం చేసికొని వాటిని తన ప్రయోజనాలకు అనుగుణంగా ఉపయోగించుకోగలిగిన వారే జీవితంలో విజయం సాధిస్తారు. అంటే మానవునికి, సమాజంలో వున్న స్వేచ్ఛ అపరిమిత మయినది కాదు. అది కొన్ని నియమాలకు లోబడివుంది. ఈ నియమ

*తన సహజ స్వభావానికి అనుగుణంగా సాగేదే నిజమైన ఆనందభరిత జీవితం.*
*— సెనేకా*

నిబంధనలను అవగతం చేసుకునే మార్గాన్ని, అధ్యయనాన్ని కాక కేవలం మానవ సంబంధాలలో ఉపకరించే కొన్ని కిటుకులను మాత్రమే తెలుసుకునే ప్రయత్నం వైఫల్యానికే దారితీస్తుంది.

అంతిమ పరిశీలనలో *సామాజిక నియమాలను అర్థం చేసుకునేందుకు లోతయిన అధ్యయనం చేయకుండా పైపై పూతలతో తృప్తిపడే ఏ వ్యక్తి అయినా కడకంటా విజయవంతంగా పురోగమించలేడు.* పాశ్చాత్య దేశాలు ముఖ్యంగా అమెరికానుంచి వెల్లువగా వస్తున్న వ్యక్తిగత వికాస సాహిత్యపు చరిత్రే దానికి తార్కాణం.

మన అంతర్గత అభిప్రాయాలు, భావాలతో సంబంధం లేకుండా పైపై మెరుగుల ద్వారా, కృత్రిమ చిరునవ్వుల ద్వారా స్నేహితులను గెలుచుకోమని రెండు దశాబ్దాల క్రిందటి వ్యక్తిగత వికాస సాహిత్యం బోధనలు చేసింది. నేడు అది ఆ పరిమితుల నుంచి బయటపడి మరో అడుగు ముందుకు వేసింది. వ్యక్తి సామాజిక సంబంధాలలో "స్నేహితులను గెలుచుకోవటం"తో సహా అన్ని విషయాలలోనూ "నిజాయితీ"గా వుండాలని నేటి వ్యక్తిగత వికాస సాహిత్యం సూచనలు చేస్తోంది. కానీ ఈనాటికి కూడా ఈ సాహిత్యం పూర్తిగా మానవీకరించ బడలేదు. పూర్తిగా సామాజిక నియమాలను అర్థం చేసికొని, బోధించే స్థితిలో లేదు.



ప్రస్తుతం ప్రపంచంలో పలు విపత్తులను సృష్టిస్తోన్న పరిస్థితులే మరెన్నో నూతన సానుకూల అవకాశాలకు మార్గాలను కూడా తెరుస్తున్నాయి. - ఆల్విన్ టాఫ్లర్





# అర్ధసత్యం

సామాజిక నియమాలనే సత్యాలకు పరిమితులు విధించే ఏ వ్యక్తిగత వికాస శాస్త్రము లేదా రచయిత, ఇతరులను విజయపథంలో నడిపించలేడు. పూర్తి అబద్ధాల కంటే పాక్షిక సత్యాలు వాటిని అనుసరించే వ్యక్తికి ఎక్కువ హాని చేస్తాయి. కానీ నేటి వ్యక్తిగత వికాస సాహిత్యం ఈ స్థితిని దాటి ఎదగలేదు.

పై వాదనకు ఒక ఉదాహరణను చూద్దాం. ఈ ఉదాహరణలో

కేవలం స్త్రీలకు సంబంధించిన అంశాన్నే ప్రస్తావించాను. అయితే ఇది కేవలం ఉదాహరణగానే చూడమని, దీనిని స్త్రీ వ్యతిరేకతగా చూడవద్దని నా అభ్యర్ధన. పురుషుల విషయంలో కూడా ఇటువంటి ఉదాహరణలు కోకొల్లలుగా వుంటాయి. నేటి యువతరంలోని అమ్మాయిలు (ముఖ్యంగా మధ్యతరగతి వారు) కట్నం ఇవ్వకుండా వివాహం చేసుకోవటం తమ ఆదర్శమని చెబుతారు. ఈ ఒక్క ఆదర్శం ప్రాతిపదికగా మొత్తం తమ వ్యక్తిత్వమే ఉన్నతమైనదిగా భావించుకొనేవారు సైతం వున్నారు. వాస్తవానికి ఈ ఆదర్శం మంచిదే. అయితే ఈ ఆదర్శాన్ని నమ్ముకొన్న యువతులలో ఎంతమంది సర్వేసర్వత్రా అన్ని విషయాలలోనూ ఆదర్శవంతులుగా వుంటారన్నదే అసలు ప్రశ్న.

మచ్చుకు ఓ అమ్మాయి తన ఆదర్శాల ప్రకారం కట్నం ఇవ్వకుండా తనకు నచ్చిన యువకుని పెళ్ళాడింది అనుకుందాం. అటు తరువాత జీవితంలో ఆ యువకుడు తాను పనిచేసే రంగంలో అవినీతిపరుడుగానూ, అడ్డదోవలు తొక్కేవాడిగానూ తేలాడనుకుందాం. మరి ఈ స్థితిలో ఈ ఆదర్శ వంతురాలు అయిన యువతి ఆ వ్యక్తిలో మార్పు రావాలని, రాని పక్షంలో అతని నుంచి వేరుపడి పోవటానికి ఎంతవరకూ సిద్ధంగా వుంటుంది? వాస్తవ జీవితాన్ని గమనిస్తే తన భార్య లేదా భర్త ఏ విధంగా డబ్బు సంపాదించినా సరే అది తమ సౌఖ్యాలకు అనుగుణమైనది గనుక, దానిని ఆమోదించే వారే మనకు నేటి సమాజంలో హెచ్చుశాతంలో కనపడతారు. అంటే ఆదర్శాలనేవి సమాజంలోని పలువురికి తామున్న స్థితికి లేదా తమ అనుకూల స్వార్థానికి వేసుకొనే ముసుగులుగానే మనకు కనపడతాయి. ఇదే నేను పైన చెప్పిన అర్ధసత్యం.

మీ స్వీయ సంక్షేమానికి సంబంధించిన పరిధుల నుంచి మీ ఆలోచన బయట పడ్డప్పుడు నిజమైన జ్ఞానోదయం అవుతుంది. - హ గాకురే

వరకట్నం ఇవ్వరాదనే నైతిక నియమం ఓ ప్రక్క, తదుపరి జీవితంలో జీవిత భాగస్వామి అవినీతిని ఆమోదించే స్వార్థం మరో ప్రక్క. ఈ ధోరణి ప్రయివేటు ఆస్తి సమాజంలో సత్యంపై విధించబడే పరిమితి. సామాజిక నియమాలను తమ కనుకూలమైనంత వరకు స్వీకరించి తమస్వార్థం, సంకుచిత ప్రయోజనాలకు అవి పొసగని చోటల్లా వీటిని తిరస్కరించటం నేటి నీతి. పై పరిస్థితికొనసాగినంత కాలం, *యువతరం అర్ధసత్యాలతోనే సంతృప్తిపడినంత కాలం వ్యక్తుల పూర్తి వ్యక్తిత్వ వికాసం అసాధ్యం.* పరిమితులు లేని స్వీయ సంకుచిత ప్రయోజనాలకు లోబడని, పరిపూర్ణ సత్యం మాత్రమే మనలను పరిపూర్ణ మానవులుగా తీర్చిదిద్దగలదు. అంతకుమించి మన భావితరాలకు సరైన పథనిర్దేశం చేసే శక్తిని, నైతికతను మనకు ఇవ్వగలదు. మనం సామాజిక నియమాలను ఉల్లంఘిస్తూ, విశృంఖల జీవితం గడుపుతూ మన తరువాత తరం (మన పిల్లలు) మన మాట వినాలనీ, నీతిమంతులుగా, వుండాలనీ, ప్రయోజకులు కావాలనీ కోరుకోవటం దురాశే.



*వ్యక్తులు విశ్వజనీన సత్యాల వెల్లడికి ఆటంకాలుగా మారితే ఆ నాగరికత నాశనమవుతుంది.*
*- రవీంద్రనాథ్ టాగోర్*



4

# జ్ఞానం : యావత్ మానవ జాతి సంపద

సమాజంలో విజ్ఞానం ఏ విధంగా అభివృద్ధి చెందుతుందో కూడా మనం అర్థం చేసుకోవాలి. జ్ఞానం వ్యక్తిగత సంపాదన అని, అది తన వ్యక్తిగత ప్రతిభ అని భావించే యువకులు సమాజంలో అధిక సంఖ్యాకులు. వ్యక్తిగత వాదానికి పెద్దపీట వేసే సమాజంలో ఇది సహజమైన ధోరణి. అయితే జ్ఞానాన్ని సామాజిక సంపదగా కాక, కేవలం తన వ్యక్తిగత ప్రతిభగా భావించుకోవటం ఎలా పొరపాటో కొన్ని ఉదాహరణల ద్వారా చూద్దాం.

మొదటగా ఒక శాస్త్రవేత్త ఉదాహరణనే తీసుకొందాం. అతను కోతులపై పరిశోధన చేస్తున్నాడనుకొందాం. ఈ పరిశోధనా క్రమంలో కోతులు తమ పరిసరాలలో ప్రమాదాన్ని శంకించినపుడు ఒక రకమైన శబ్దాన్ని చేస్తాయని అతను గమనించాడనుకొందాం. అదే సందర్భంలో ఈ శాస్త్రవేత్త ఒక ప్రొఫెసర్‌గా కూడా వుంటూ క్లాస్‌రూంలో బోర్డుపై రాసేటప్పుడు ఒక్కోమారు వచ్చే కీచుమనే శబ్దానికి విద్యార్థులు (తనతోసహా) ఒక రకమయిన గగుర్పాటుకు లోనవుతారని గమనించాడనుకుందాం. భయపడినప్పుడు కోతులు చేసే శబ్దం, ఈ సుద్దముక్కతో రాసేటప్పుడు వచ్చే శబ్దం ఒకే రకమైనవి అనుకొందాం. కాగా కోతులు తమ పరిసరాలలోని వాస్తవ ప్రమాదానికి ప్రతిస్పందనగా ఈ శబ్దాన్ని చేయగా, వాస్తవానికి ఎటువంటి ప్రమాదాన్నీ సూచించని సుద్దముక్క కీచు శబ్దం ఎందుకు గగుర్పాటు కలిగిస్తుందో తెలుసుకోవటానికి ఆ శాస్త్రవేత్త ప్రయత్నించాడనుకుందాం. ఈ శాస్త్రవేత్త మానవ పరిణామ సిద్ధాంతంలో కూడా నిష్ణాతుడు అనుకొందాం. ఈ మొత్తం నేపథ్యంలో తన విద్యార్థులూ, తాను అప్పుడప్పుడు సుద్దముక్క చేసే కీచుమనే శబ్దానికి గగుర్పడటానికి గల కారణం మానవుడు మన జాతి నుంచే ఆవిర్భవించారనే వాస్తవమే కారణమని గుర్తించాడనుకొందాం. ఆదిమ యుగంలో మానవుడు తన పరిసరాలలోని అభద్రతా భావం ప్రభావంలో ఇదేరకమైన శబ్దాన్ని చేసి వుండవచ్చునని అతను గుర్తించాడనుకుందాం. ప్రస్తుతం మానవ జీవితంలో ఈ భౌతిక అభద్రత తాలూకూ పరిస్థితులు లేవు. అయితే మానవుని అంతః చేతనలో నిక్షిప్తంగా మిగిలిపోయిన ఆదిమ అభద్రతా భావం సుద్దముక్క శబ్దం వలన ప్రేరేపించబడి అతని గగుర్పాటుకు కారకం అవుతుందని ఆ శాస్త్రవేత్త నిర్ధారణకు వచ్చాడనుకొందాం.

> ప్రేమపూరితం కాని విజ్ఞాన సముపార్జన మరింత గందరగోళానికి, ఆత్మ వినాశనానికే దారితీస్తుంది.
> – జిడ్డు కృష్ణమూర్తి

ఇది ఒక చాలా చిన్న విషయానికి సంబంధించిన అతి చిన్న పరిశోధనా ఫలితం. అయితే ఆ శాస్త్రవేత్త ఈ అంశంలో నిర్దిష్ట సూత్రీకరణకు రావడానికి వెనుక పలు సామాజిక రంగాలూ, విజ్ఞానం పునాదులుగా వుంటాయి. ఆ శాస్త్రవేత్తకు కోతులపై పరిశోధన చేసే అవకాశం, ప్రొఫెసర్‌గా విద్యార్థులకు బోధించే అవకాశం కలిసివచ్చే పరిస్థితి వుండాలి. దానికిగానూ మొత్తం చారిత్రక నేపథ్యం సిద్ధంగా వుండాలి. క్లాసురూములలో బోర్డుపై అధ్యాపకులు రాసి బోధించే కాలంలో, మానవ పరిణామ శాస్త్రం కనుగొనబడిన కాలంలో, కోతులపై పరిశోధన ఒక పరిశోధనా అంశంగా వున్న కాలంలో అతను జన్మించి వుండాలి. అంటే ఆ శాస్త్రవేత్త ఈ చిన్న నిర్ధారణకు రావటానికి మానవజాతి సృష్టించిన విజ్ఞాన ఖజానా అతనికి అందుబాటులో వుండాలి.

దీని అర్థం ఒక వ్యక్తి విజ్ఞానం గాలి నుంచి రాలిపడేది కాదనీ, మాయా - మంత్రంగా సంక్రమించేది కాదనీ, కేవలం వ్యక్తిగత ప్రతిభ కాదనీ మనం గుర్తించాలి. ప్రతి వ్యక్తీ తాను వున్న చారిత్రక పరిస్థితులలో అభివృద్ధి అయివున్న విజ్ఞానాన్ని తానున్న ప్రత్యేక పరిస్థితిలో అవగతం చేసుకుంటాడు. దాని పునాదిపైనే నూతన విజ్ఞానాన్ని సృష్టిస్తాడు. అంటే ఒక వ్యక్తి తాలూకు విజ్ఞానం ఒక చారిత్రక కాలంలో మానవ సంబంధాలలో అతను వున్న ప్రత్యేక స్థానానికి ప్రతిబింబంగా వుంటుంది. ఇక్కడ మనం వ్యక్తి ఒక మానవ సంబంధాల నెట్‌వర్క్ లేదా వెబ్‌లో వున్నాడనే ముందు చెప్పుకొన్న అంశాన్ని గుర్తుచేసుకుందాం. మానవజాతి విజ్ఞానం ఈ నెట్‌వర్క్‌లో వున్న వివిధ వ్యక్తుల వద్ద వివిధ రకాల కలయికల (Permutations and Combinations) కు లోనవుతుంది.

*నా అంతర్గత, బహిర్గత జీవితంలో హెచ్చు మోతాదు; నా గతకాలపు, నా వర్తమాన మానవుల కృషినించి ఆవిర్భవించిందని దైనందినం పలుమార్లు నేను గుర్తు చేసుకుంటుంటాను. నేను స్వీకరించినదానికి బదులుగా నేను ప్రపంచానికి ఇవ్వవలసింది చాలా వుందని భావిస్తాను.*

*- ఆల్బర్ట్ ఐన్‌స్టీన్*

ఈ ఉదాహరణ జ్ఞానం ఏ వ్యక్తికీ గుత్త సొత్తు కాదనీ, అది సమాజ సంపద అనే సామాజిక నియమాన్ని వెల్లడిస్తుంది.,

వ్యక్తి విజ్ఞానం, జీవితంలో అతని స్థానం చారిత్రకంగా, ముందు పేర్కొన్న నెట్‌వర్క్‌పరంగా నియంత్రించబడటానికి మరో ఉదాహరణ చూద్దాం. పలు దశాబ్దాలక్రితం వరకు మేనేజ్‌మెంట్ కోర్సు ఒక విజ్ఞాన రంగంగా గుర్తింపు పొందలేదు. అయితే నేడు ఆ రంగం సమాజంలోని పలువురి యువకులను ఆకర్షించే కెరీర్ మార్గంగా రూపుదిద్దుకొంది. అలాగే వర్తమాన చరిత్రలో విస్తృత ఆకర్షణగా వున్న కంప్యూటర్ సాఫ్ట్‌వేర్ రంగం కూడా ముందుగా ఈ విజ్ఞాన శాస్త్ర రంగాలు మొలకెత్తడానికి కావలసిన చారిత్రక నేపథ్యం ఏర్పడిన తరువాతే ఆ రంగాలలో పలువురికి కెరీర్ అవకాశాలు ఏర్పడ్డాయి. ఇదే పరంపరలో ఆలోచిస్తే భవిష్యత్తులో మానవజాతి విజ్ఞాన అభివృద్ధి మరిన్ని నూతన రంగాలను సృష్టిస్తుంది. మరెంతోమందికి "కెరీర్"లను కల్పిస్తుంది. అంటే మనం జన్మించిన చారిత్రక కాలంలో వున్న కెరీర్ అవకాశాలు మన జీవిత మార్గాన్ని నిర్దేశిస్తాయి. కాబట్టి కాలంతో కూరుకుపోయి, తక్షణ పరిస్థితులనే చూస్తూ తాను విజ్ఞానవంతుడననీ, జ్ఞానం తన వ్యక్తిగత సొత్తు అనీ, ప్రతిభావంతుడననీ, భావించుకోవడం ఉష్ట్రపక్షి ధోరణి.

అయితే మనం పై వాస్తవాన్ని గుర్తించి జీవితపు సన్నటి సందులను దాటి ఆలోచించడం మొదలుపెట్టిన మరుక్షణం మనం నిజమయిన సామాజిక నియమాలను అర్థం చేసుకున్న వారమవుతాం, పాటించినవారమవుతాం. ఇది మనకు పరిపూర్ణ స్వేచ్ఛను, జీవితంలో మెరుగయిన విజయావకాశాలనూ, దూరదృష్టినీ కలిగిస్తుంది. అంటే *తానున్న చారిత్రక కాలపు సామాజిక నియమాలను అర్థం చేసుకుని, పాటించిన వ్యక్తి నిజమైన స్వేచ్ఛా జీవి. ఇది ఆ వ్యక్తిని అహంకారం లేనివాడిగానూ, నిరాడంబరుడిగానూ,*

నిజమైన విముక్తిని కోరుకునేవారు తమ సంపదలకు తమను కేవలం ట్రస్టీలుగా మాత్రమే భావించుకుంటారు. ఆ సంపదలు తమ సొత్తని భావించరు. - మహాత్మా గాంధీ

నిజమైన విజయపంథాలో పయనించేవాడిగానూ తీర్చిదిద్దుతుంది.

అంతేకాకుండా మనకు తెలిసినది తక్కువనీ, తాను తెలుసుకోవలసినది చాలా వుందనీ గుర్తించిననాడే ఒక వ్యక్తి జీవితంలో నిరంతర పురోభివృద్ధిని సాధించగలడు. నేటి యుగంలో నిరంతరం కొత్త విషయాలు నేర్చుకోని వ్యక్తి కెరీర్‌లో సహితం పైపైకి వెళ్లలేదని మనం గుర్తించాలి. ఇది నేడు మేనేజ్‌మెంట్ సిద్ధాంతాలు సైతం ఘోషిస్తున్న అంశం. దానికి ఈ ప్రక్క చిత్రాన్నే చూద్దాం.



విశ్వ విజ్ఞానం

ఈ చిత్రంలోని రెండు సర్కిల్స్‌లో వున్నవారు A, B అనే ఇరువురు వ్యక్తులు. వారిరువురి చుట్టూ వున్న చతురస్రాన్ని మొత్తం విశ్వంలో వున్న విజ్ఞానం అనుకుందాం. ఈ నేపథ్యంలో పై చిత్రంలో A - చుట్టూ వున్న సర్కిల్ పెద్దది. B - చుట్టూ వున్న సర్కిల్ చిన్నది. అంటే విశ్వ విజ్ఞానంలో B - కంటే, A కు తెలిసింది ఎక్కువ. అయితే ఇక్కడ, మనం ఒక వింత గొలిపే అంశాన్ని గమనించవచ్చు. విశ్వ విజ్ఞానంలో A - కి, B - కి కూడా తెలియని (మిగిలిన చతురస్రం) విజ్ఞానం చాలా వుంది. కానీ ఈ తెలియని విశ్వ విజ్ఞానంలో A - కి వున్న సర్కిల్‌కి ఎక్కువ సంబంధం వుంది. ఎందుచేతనంటే పెద్ద సర్కిల్‌లో వుండడం ద్వారా A కు

భూమి మానవుడి సొత్తుకాదు. మానవుడే భూమి సొత్తు.
- చీఫ్ సీటెల్

తెలిసిన విజ్ఞానం విశ్వంలోని తెలియని విజ్ఞానంతో ఎక్కువ సంబంధం కలిగి వుంది. కాగా చిన్న సర్కిల్‌లో వున్న B - కు విశ్వ విజ్ఞానంలో తెలియని దానితో సంబంధం తక్కువ వుంది. ఇదంతా దేనిని సూచిస్తుంది? అధిక విజ్ఞానవంతుడయిన వ్యక్తే (ఆ విజ్ఞానం తన సొంతం అని విర్రవీగకపోతే) తనకు తెలిసింది చాలా తక్కువనీ, తెలుసుకోవలసింది చాలా వుందనీ గ్రహిస్తాడు. కాగా ఏమీ లేని విస్తరి ఎగిరెగిరి పడుతుందన్నట్లు తక్కువ జ్ఞానం వున్న వ్యక్తి ఎక్కువ అహంభావిగా, తక్కువ జ్ఞానార్థిగా వుండే అవకాశం వుంది. అందుచేత నేటి యువతరం తనకు తెలిసిన విజ్ఞానం పరిమితులను గుర్తించి, అధిక విజ్ఞాన సముపార్జన ద్వారా ఎక్కువ విజ్ఞానానికై పయనించాలి. తన విజ్ఞాన సర్కిల్‌ను పెంచుకునేందుకు కృషి చేయాలి. లేని పక్షంలో గ్లోబల్ విలేజ్‌గా చెప్పబడుతున్న మన ప్రపంచంలో మిగిలేవన్నీ బావిలో కప్పలే.



మానవుల పరిమితులను అర్థం చేసుకోగలగటం, అలాగే తన స్వీయ పరిమితులను అర్థం చేసుకోగలగటం నిజమైన విజ్ఞతకు ఆరంభం. - సామెత







# ఆవేశం పరిపుష్టత

## (Emotional Quotient లేదా E.Q)

నేటివరకూ ఉద్యోగ అవకాశాలు మొదలుకొని, వివిధ రంగాలలో విజయానికి I.Q (Intelligence Quotient) కొలబద్దగా పరిగణించబడుతూ వచ్చింది. అయితే జీవితంలో విజయం సాధించటానికి I.Q. ఒక్కటే సరిపోదనీ, E.Q (Emotional Quotient) కూడా కావాలనీ .... కొత్త సిద్ధాంతం ముందుకు వచ్చింది.

EQ. మానవుని కుడిప్రక్కన వున్న మెదడు తాలూకు అంశం. అంటే జీవితంలో విజయానికి వస్తుగతమయిన Left Brain తెలివితేటలతో పాటుగా, మానసిక ఆవేశాల పరిపక్వత కూడా అవసరమనేది నేటి నూతన సిద్ధాంతం.

కాగా నేడు సమాజంలో నెలకొనివున్న అర్ధ సత్యాల పరిమితులలో మానసిక పరిపక్వత ఎంతవరకూ సాధ్యమో ప్రశ్నార్థకమే. ఎందుచేతనంటే మానవుడి కుడి, ఎడమ మెదడు భాగాలు పరస్పరం ఒకదానిపై ఒకటి ఆధారపడి వున్నవి. I.Q. (ఎడమ ప్రక్క మెదడు భాగానికి సంబంధించిన తర్కం) అసంపూర్ణంగా, అర్ధసత్య భరితంగా వున్నప్పుడు ఆ వ్యక్తి *E.Q కూడా పూర్తి పరిపక్వతను సాధించలేదు. ఏతావాతా ఒక వ్యక్తికి తన తోటివారికంటే ఎక్కువ E.Q వుందనుకున్నా అది కేవలం మానిప్యులేషన్‌కు, తేనె పూసిన కత్తివలె పనిచేయటానికి మాత్రమే సహకరిస్తుంది.* (ఇది నేటి సమాజంలో హెచ్చుమందికి వర్తిస్తుంది). ఇటువంటి వ్యక్తులు సంకుచిత విజయాలను, పరిమిత ప్రయోజనాలను మాత్రమే సాధించగలరు. కాబట్టి తనలో సత్యంపై వున్న సంకెళ్లను తెంచుకోకుండా, అధిగమించకుండా ఏ వ్యక్తీ పూర్తి మానసిక పరిణతిని (E.Q) కూడా సాధించలేడు. అందుచేత E.Q అనేది జీవితంలో పైకి రావటానికి అదనుకోసం ఎదురుచూసే గుంటనక్కలను, సంకుచిత ప్రయోజనాలను జీవిత లక్ష్యాలు అనుకునే వృద్ధ యువకులను మాత్రమే తయారుచేయ గలదు.

> పుట్టుకతోనే ఎవ్వరూ సర్వజ్ఞులు కారు. కాలం మనిషికి క్రమేణా పరిపక్వతను యిస్తుంది.
> \- మిగ్వెల్ డి సెర్వాంటెస్

జీవితంలో శాశ్వతమైన దానిని, చిరస్థాయిగా నిలిచేదానిని సాధించడంలో ప్రస్తుత సామాజిక పరిస్థితులలో E.Q సయితం సాధించలేదు. అందుచేత యువకులు ఈ పుస్తకం మొదటి పుటలలో పేర్కొన్నట్లు Rationally - Emotional (ఆలోచించి ఆవేశాలను నడుపుకునే వారు)గా పరిపూర్ణ సత్యంతో ముందుకు నడవకుండా ఏ రంగంలోనూ నిఖార్సయిన విజయాన్ని సాధించలేరు.




కేవలం శక్తి లేదా తెలివితేటలకంటే నిరంతర కృషే మన శక్తి సామర్థ్యాలకు రెక్కలివ్వగలదు.
— లియోన్ కార్డెన్





# ఆర్థిక వెనుకబాటుతనం అపరిపక్వ మనస్తత్వాలు

సమాజం ఆర్థిక పునాది, అభివృద్ధి స్థాయి ఆ సమాజంలోని మానవుల మనోస్థితిని, శక్తి సామర్థ్యాలను నిర్దేశిస్తుంది. ఇప్పుడిప్పుడే అభివృద్ధి చెందుతున్న మన దేశం వంటి దేశాలలో వ్యక్తులు పరిపూర్ణ వికాసాన్ని సాధించటం కష్టం. దీనికి నిదర్శనంగా మనం నివసిస్తున్న చారిత్రక కాలం మన మనోస్థితిని ఎలా నిర్దేశిస్తుందో ఇంతకుముందు పేర్కొన్న

ఉదాహరణలలో చూశాం.

మనదేశం సాంకేతికంగా అభివృద్ధి చెందిన స్థాయిలో (ముఖ్యంగా ఈ మధ్యకాలంలో) మన దేశంలోని మెజారిటీ యువకుల మానసిక స్థాయి ఎదగలేదు. దానికి కారణం మన దేశంలోని యువతరంలో పరస్పర విరుద్ధ ధోరణులు ఉండటమే కారణం. ఓ ప్రక్క ఓ మేరకు అభివృద్ధి చెందిన నూతన సాంకేతిక పరిజ్ఞానపు పరిశ్రమలు, మరోప్రక్క "ఎడ్లబండి మీద కంప్యూటర్‌లు రవాణా" చేసే ఆర్థిక వెనుకబాటుతనం నేటి మన దేశ ఆర్థిక స్థితి. ఈ పై వైరుధ్యం వలన ఆధునిక సాంకేతికరంగ పరిస్థితులలో పనిచేస్తున్న యువతరం కూడా జీవితంలో పరస్పర విరుద్ధ భావాల భారాన్ని మోస్తుంది. వృత్తి జీవితంలో ఆధునిక భావనలూ, వ్యక్తిగత జీవితంలో గతం తాలూకు పరిణతి లేని భావనలూ వీరిలో వున్నాయి. ఇది వారి కెరీర్‌ల అభివృద్ధికి ఆటంకం అవుతుంది. నేటి గ్లోబల్ విలేజ్‌లో ఇది మరింత నిజం. కాబట్టి వ్యక్తిగత జీవితంలో కూడా ఆధునిక భావాలకు తావివ్వకుండా ఏ వ్యక్తీ కెరీర్‌లో బాగా ముందుకు వెళ్లలేడు. దానికిగాను ఒక సాంస్కృతిక పెనుమార్పు అవసరం. లేని పక్షంలో బార్‌లలో బీరులు త్రాగుతూ, డిస్కో డాన్సులు చేస్తూ తాము నాగరికులము అయ్యామనుకొనే యువతరం మాత్రమే మనకు మిగులుతుంది. ఇది సమాజ అభివృద్ధికి, ఆయా యువకుల అభివృద్ధికి కూడా ఏమాత్రం ఉపకరించదు. రానున్న కాలంలో వచ్చేది విజ్ఞానం పునాదిగా కల సమాజం అని "అల్విన్ టాఫ్లర్" వంటి పాశ్చాత్య మేధావులు చెబుతున్న అంశాన్నే మన యువతరం ఇక్కడ దృష్టిలో

> భౌతిక విషయాలకు కారణాలు ఏమిటో తెలుసుకోవటమే అన్నింటికన్నా సంతోషకరం.
> \- వర్జిల్

వుంచుకోవాలి. ముందుకాలంలో మానవుడికి విజ్ఞానము, సమాచారమే ప్రధాన సంపత్తిగా వుంటుందని వారు గుర్తించాలి. అందుచేత తమ కెరీర్‌లను కేవలం నేడున్న ప్రత్యేక పరిస్థితుల దృష్ట్యా కాక, అనతికాలంలో సమాజాన్నే తుపానులా చుట్టుముట్టనున్న నూతన ధోరణుల తీరుతెన్నులకనుగుణంగా రూపుదిద్దుకోవాలి.



> ముందు తిండి, తర్వాతే ఏ నీతులు అయినా.
>
> – బెర్టోల్ట్ బ్రెచ్ట్






# సంకెళ్ళు తెంచుకుంటున్న మేధస్సు

ఆ మధ్య ఒక పత్రికలో అమెరికా అధ్యక్షుడు గ్రహాంతరవాసితో కలిసి మాట్లాడుతున్నట్లు వున్న ఫొటోలు వచ్చాయి. ఆ గ్రహాంతరవాసి మహా మేధావి అని ఆ వార్తలు పేర్కొన్నాయి. ఆ వార్తల ప్రకారంగా ఆ గ్రహాంతరవాసి మేధస్సు ప్రస్తుత సరాసరి మానవ మేధస్సుకు 4-5 రెట్లు ఎక్కువ. ఈ వార్తలో నిజం ఎంత అనే మాట ప్రక్కన పెడదాం.

అయితే భూమిమీద నివసిస్తున్న మనమే ప్రతి తరానికీ తెలివితేటలు పెరిగిపోతున్నాయి అంటూ ముక్కుమీద వేలు వేసుకుంటున్నాం.

మానవజాతిలో తరతరానికీ తెలివితేటలు మరింత ఇనుమడిస్తున్నాయనేది తిరుగులేని వాస్తవం. దీనికి జన్యుపరమైన కారణాలు మాత్రమే మూలం కాదు. వాస్తవానికి జరుగుతున్నదల్లా మానవుని మేధస్సుపై వున్న సంకెళ్లు తరతరానికీ తెగిపోవటమే. శాస్త్ర విజ్ఞాన విస్తృతి, ప్రభావం వలన మానవజాతి రోజురోజుకీ మేధాపరంగా ఎదుగుతోంది.

నిన్నటి "సత్యాలే" నేటి మూఢ విశ్వాసాలని ఒక ప్రముఖ తత్వవేత్త అంటారు. ఇలా తరతరానికీ మూఢ విశ్వాసాలు, గుడ్డి నమ్మకాలు తగ్గుముఖం పట్టి వాటి స్థానంలో శాస్త్ర విజ్ఞానం ప్రోది చేసుకోవటం వలన మానవజాతి మేధో పరిణతి సాధ్యం అవుతోంది. ప్రతితరం, మన ముందుతరం నుంచి తాను వారసత్వంగా అందుకొన్న అశాస్త్రీయ భావనలను మోతాదు తగ్గించి (తాను తెలుసుకున్న నూతన శాస్త్ర అంశాల ప్రభావం క్రింద) తన తరువాతి తరానికి అందిస్తోంది. ఇలా తగ్గుముఖం పడుతోన్న అశాస్త్రీయ విశ్వాసాల కారణంగా, పెరుగుతున్న శాస్త్రీయ దృక్పథం కారణంగా ప్రతీ నూతన తరం మేధో పరంగా మరింత విముక్తమవుతోంది.

దీనికి ఒక్క ఉదాహరణనే చూద్దాం. గత తరంలో పెద్దవాళ్లు పిల్లలను నిద్ర పుచ్చేందుకు బూచి ఏదో వచ్చి పట్టుకెళుతుందనే భయాన్ని సాకుగా చూపేవారు. ఇదెలా అసహేతుకమో తరువాత చూద్దాం. అయితే నేటి నాగరిక విద్యావంతులయిన తల్లిదండ్రులు ఇలాంటి పిట్ట కథలు చెప్పటం కొంతవరకు తగ్గిందన్నది మనం కళ్లారా చూస్తున్నాం. ఇక ఈ బూచి మాటకే వస్తే, వాస్తవానికి పసిపిల్లలను మూఢ నమ్మకాలకూ, పలాయనవాదానికీ అది ఏ విధంగా గురిచేస్తోందో చూద్దాం. కళ్లు తెరచి మేలుకొని వుంటే బూచి వచ్చి పట్టుకెళ్లడం నిజమయితే, కళ్లు మూసుకొని

> సత్యం మహోన్నత మానవుని లక్ష్యం.
>
> – కన్ఫ్యూషియస్

అప్రమత్తంగా లేని స్థితిలో పిల్లలను పట్టుకెళ్లడం ఆ బూచికి సులువే కదా? ఈ రకం అజ్ఞానం పిల్లలలో తాను వాస్తవాన్ని చూసీ చూడనట్లు *ఊరుకుంటే తనకు శ్రేయోదాయకమనే పలాయనవాదాన్ని పెంచి ప్రోది చేస్తోంది. బాల్యంలో ఇలాంటి మూఢ విశ్వాసాల మధ్య పెరిగిన వ్యక్తులు జీవితంలో వాస్తవాన్ని వాస్తవంగా చూడలేరు. ఎదుర్కోలేరు.*

అయితే నేటికీ సమాజంలో ఈ రకం మూఢ విశ్వాసాలు ఏదో ఒక రూపంలో కొనసాగుతున్నాయి. ఇవి రేపటి తరానికి మానసిక బంధాలుగా వుంటాయి. అందుచేత నేటి యువతరం తమకు బాల్యంలో తల్లిదండ్రులు, ఇతరుల నుంచి సంక్రమించిన అశాస్త్రీయ భావనలను పునః సమీక్షించుకోవాలి. లోతయిన అధ్యయనం, శాస్త్ర విజ్ఞాన సముపార్జన ద్వారా తమ అంతఃచేతనలోని అశాస్త్రీయ భావాలను ఎదుర్కోవాలి. ఇలాంటి ప్రక్రియకు నూతనంగా రంగంమీదకి వస్తున్న న్యూరో లింగ్విష్టిక్ ప్రోగ్రామింగ్ వంటి "కిటుకులు" ఉపయోగపడతాయి. అయితే ఈ పుస్తకంలో పేర్కొన్నట్లు ఇవి కేవలం కిటుకులు మాత్రమే.

అందుచేత నేడు పలు వ్యక్తిత్వ వికాస సిద్ధాంతాలు చేస్తున్న ప్రతిపాదనలను విజయవంతంగా ఉపయోగించుకోగలగాలంటే ముందుగా అర్ధ సత్యాలను విడనాడటం, మొత్తం సామాజిక నియమాలను అర్థం చేసుకోవటం ముందస్తు షరతు. దీనికై వున్న ఏకైక మార్గం మరోమారు పునరుద్ఘాటించాలంటే : "అధ్యయనం, అధ్యయనం, అధ్యయనం". ఆత్మ విమర్శ, పరిశీలనా అధ్యయనం ద్వారా మాత్రమే సరైన తాత్విక ధోరణి, తద్వారానే వ్యక్తిత్వ పరిణతి సాధ్యం.

కాగాపోగా ఈ తరతరానికి తెగుతున్న మానసిక సంకెళ్లు, పెరుగుతున్న తెలివితేటల మాటను ప్రక్కనపెడితే; అసలు వర్తమానంలో వున్న

> *తన నిజమైన శక్తి, సామర్థ్యాల తాలూకు, పై పూతలను మాత్రమే మానవజాతి యిప్పటివరకూ చూసింది. - సామెత*

తెలివితేటలలో మనిషి ఏపాటి సక్రమంగా వాడుకుంటున్నాడో చూద్దాం. ఐన్‌స్టీన్ వంటి మహా మేధావే తన శక్తియుక్తులు, తెలివితేటలలో కేవలం అణుమాత్రమే వాడుకొన్నాడనేది పలువురు శాస్త్రజ్ఞుల పరిశోధనా సారం. అందుచేత తాము తెలివితక్కువ వారమని భావించుకునే వారు వాస్తవానికి తమ మెదడుకు పదునుపెట్టి, దానిని సాధ్యమయినంత ఎక్కువగా వినియోగించుకోవటం లేదనేది తేలే విషయం. దీనికి పలు సందర్భాలలో; జీవితంలో సరైన లక్ష్యం లేకపోవటం, సోమరితనం కూడా కారణం అవుతాయి.

*కాబట్టి ప్రతి మనిషీ తన వర్తమాన జీవితంలోని ప్రతిక్షణాన్నీ దీర్ఘకాలిక లక్ష్యాలతో, పూర్తి చిత్తశుద్ధితో వినియోగించుకోవటానికి కృషి చేయాలి.* దీనికిగాను ప్రతి వ్యక్తి తాను ఐచ్ఛికంగా ఎంపిక చేసుకున్న (ఇతరుల చేత రుద్దబడింది కాదు) రంగంలో కృషి చేయాలి. దీనికై ఆ వ్యక్తి తనకు నప్పని రంగాలలో ఇతరులతో పోటీ పడడం, పోల్చి చూసుకోవడం మానివేయాలి. తన వ్యక్తిత్వానికి పొసగని రంగాలలో పనిచేయటమే పలువురి మేధో వికాసానికీ, వ్యక్తిత్వ పురోగతికీ ఆటంకంగా నిలుస్తోంది.



మానవజాతి యింకా కనుగొనని విషయాలు సముద్రాలలోనో లేదా ఖండాలపైనో లేవు; అవి మానవుల మస్తిష్కాలు, హృదయాలలో వున్నాయి. - అలెన్ ఇ. క్లాక్స్‌టన్





# అదృష్టం

సమాజంలో క్రింది స్థాయి నుంచి పైకి వచ్చిన వారిని మనం చాలామందిని చూస్తూ వుంటాం. ఇది వారి అదృష్టమని సర్దుకుపోయే వాళ్లను చూస్తుంటాం. మొత్తం మీద పైకి వచ్చేందుకు ఒక సమాజంలోవున్న అవకాశాలు వ్యక్తుల ఎదుగుదలను నిర్దేశించే మాట నిజం. అయితే ఇది పాక్షిక సత్యం మాత్రమే.

ఒక ప్రఖ్యాత వ్యాపారవేత్త చెప్పినట్లు "దానికై సిద్ధంగా వున్న వారినే అదృష్టం వరిస్తుంది". అంటే జీవితంలో శ్రమించకుండా, కృషి

చేయకుండా కేవలం అదృష్టం ద్వారా పైకి రావాలనుకోవటం, గాలిలో దీపం పెట్టి దేవుడా రక్షించు అనడం లాంటిదే. నిరంతర కృషి, సరైన సామాజిక అవగాహన, అర్ధ సత్యాల పరిత్యాగం, పూర్తి సత్యాల ఆవిష్కరణ, అధ్యయనం, శాస్త్రీయ తాత్వికత ద్వారా మాత్రమే మనిషి తనకు లభించే అదృష్టమనబడే అవకాశాలను సక్రమంగా వినియోగించు కోగలదు. జీవితంలో ఎదగగలడు.

దానితోపాటుగా అదృష్టం (Chance) విషయంలో మనం గుర్తించాల్సిన మరో ముఖ్య అంశం వుంది. సమాజాన్ని నడిపే కొన్ని సూత్రాలున్నాయని మనం ఇంతకు ముందు అధ్యాయంలో చూశాం. దీని అర్థం సమాజంలో అన్ని వేళలా ఈ సూత్రాలే గురి తప్పకుండా పనిచేస్తుంటాయని కాదు. ఒక్క నిర్దిష్ట సంఘటనలో ఒక్కోమారు పలు సామాజిక నియమాలు ఒకదానితో ఒకటి ఘర్షణ పడవచ్చు. ఈ ఘర్షణ పరిస్థితులలోనే అదృష్టం (Chance) తలఎత్తుతుంది.

ఉదాహరణకు సులభ గ్రాహ్యమయ్యే భౌతికశాస్త్ర నియమాలనే తీసికొందాం. ఒక వ్యక్తి ప్రయాణిస్తున్న బెలూను చెడిపోయి ప్రమాదవశాత్తూ పై నుంచి నీటిలో పడిపోయాడు అనుకుందాం. ఈ ప్రత్యేక ఘటనలో రెండు భౌతికశాస్త్ర నియమాలు పనిచేస్తాయి. వీటిలో ఒకటి వ్యక్తి క్రిందపడటానికి సంబంధించిన భూమ్యాకర్షణ సూత్రం. ఇక రెండవది నీటికి సహజంగా ఉండే తేలియాడించగల (ఈత వచ్చిన వారిని సుమా!) లక్షణం తాలూకు సూత్రం. ఈ రెండు విరుద్ధ సూత్రాలు పరస్పరం ఘర్షించుకోవటంలో అదృష్టవశాత్తూ ప్రయాణిస్తున్న బెలూను నుంచి పడిపోయిన వ్యక్తి సజీవంగా బయటపడే అవకాశం ఏర్పడుతుంది.

మనిషిని రోగాల బారిన పడకుండా కాపాడే వ్యాక్సినేషన్‌ల

> నేను అదృష్టాన్ని బలంగా నమ్ముతాను. నేనెంత కష్టపడి పనిచేస్తే, అది నన్ను అంతగా వరిస్తుంది. - థామస్ జెఫర్‌సన్

ఉదాహరణనే చూద్దాం. ఇక్కడ వైరస్, బ్యాక్టీరియాలు ఒక వ్యక్తి శరీరంలోకి ప్రవేశించినప్పుడు అతను జబ్బుపడతాడు అనేది సాధారణ సూత్రం. కాగా వ్యాక్సినేషన్ ద్వారా చిన్న మోతాదులో ఆ వ్యక్తి శరీరంలోకి జబ్బు పడక ముందుగానే అదే తరహా వైరస్, బ్యాక్టీరియాను ఎక్కించడం ద్వారా శరీరంలోని వ్యాధి నిరోధక పోరాట పటిమా సూత్రాన్ని శక్తివంతం చేయడం, మరో జీవశాస్త్ర సూత్రం. ఈ రెండు విరుద్ధ సూత్రాలూ ఘర్షణ పడ్డప్పుడు కూడా ఆ జబ్బు నుండి బయటపడే యోగం (Chance) ఆ వ్యక్తికి కలుగుతుంది.



ప్రపంచంలో ప్రతిభ వున్నవారు లెక్కలేనంతమంది ఉంటారు. అయితే అసలు సమస్యల్లా - వీరిలో ఎంతమందికి స్థిరంగా, నిలకడగా నిలిచే శక్తి ఉన్నది అన్నది.

- నోయల్ కవార్డ్





# తెరల మాటున ..... ....

ఇతరులు సాధారణంగా చూడలేని వాస్తవాలను చూడగలిగిన వారే జీవితంలో అసాధ్యాలను సుసాధ్యం చేయగలరనేది నానుడి. జీవితం ప్రతి మూలలోనూ అవకాశాలు కోకొల్లలుగా వుంటాయి. అయితే ఆ అవకాశాలను గుర్తించే మానసిక స్థితి మనకు వున్నదా లేదా అన్నదే అసలు ప్రశ్న. జీవిత వాస్తవాన్ని, అవకాశాలను చూడగలగటం మన మానసిక స్థితిమీదే చాలావరకూ ఆధారపడి వుంటుంది.

పైన పేర్కొన్నదానికి నిదర్శనంగా అమెరికాలో శాస్త్రవేత్తలు

నిర్వహించిన ఒక ప్రయోగాన్నే ఉదాహరణగా పేర్కొనవచ్చు. వారు కొంతమంది వ్యక్తులను ఒక గదిలో కూర్చోబెట్టి, వారిని భిన్న గ్రూపులుగా విడగొట్టారు. ఒక్కో గ్రూపుకు ఒక్కో కాలవ్యవధిలో ఆహారాన్ని యిచ్చారు. ఒక గ్రూపు వారికి దరిదాపుగా 48 గంటలపాటు అసలు ఆహారాన్ని యివ్వలేదు.

తదనంతరం ఈ వివిధ గ్రూపులలోని వారికి అర్థంపర్థం లేని చిత్రలేఖనాలను చూపారు. కాగా హెచ్చుశాతం సమయం ఆహారం లేకుండా వున్న గ్రూపుల వారు ఈ చిత్రాలలో పెక్కింటిని ఘుమఘుమలాడే ఆహార పదార్థాల చిత్రీకరణలుగా పేర్కొన్నారు. ఈ ప్రయోగం మనిషి వున్న మానసిక స్థితి అతని ప్రాపంచిక అవగాహనను, దృక్పథాన్ని నిర్దేశిస్తుందని తెలుస్తుంది.

అంటే వాస్తవ భరితమైన జీవిత దృక్పథం వుంటే మనం యితరులు చూడలేని అవకాశాలను జీవితంలో చూడగలం.

అలాగే మరో ఉదాహరణను చూద్దాం. మావటీలు ఏనుగు గున్నను అడవిలో మొదటగా పట్టుకొన్నప్పుడు దీనిని బలమైన ఇనుప సంకెళ్లతో పెద్ద చెట్టుమానుకు కడతారు. దీనివలన ఆ ఏనుగు గున్న తొలుత తప్పించుకునేందుకు పలు విఫలయత్నాలు చేస్తోంది. తదనంతరం తన ప్రయత్నం వృథా అని భావించి రాజీపడిపోతుంది. అటు తరువాత సర్కస్ కంపెనీలో చేరినప్పుడు అదే ఏనుగు గున్నను దాని వయసు పెరిగిన తరువాత కూడా చిన్న తాడుతో బలంలేని ఒక మోకుకు నామమాత్రంగా బంధిస్తారు. అయితే తన చిన్ననాడే ఏర్పడిపోయిన తప్పించుకోలేననే పరిమితులను విధించే నమ్మకం వలన ఆ ఏనుగు పారిపోవడానికి ఎటువంటి ప్రయత్నం చేయదు. ఇలాంటి పరిమితులను

*నీవు చూడగలిగిన దానినే నీవు పొందగలవు.*

*- స్టీవ్ విల్సన్*

విధించే నమ్మకాలు మానవునికి కూడా వర్తిస్తాయి.

పెంపకంలో చిన్ననాడే ఏర్పడిపోయిన పరిమితిని విధించే విశ్వాసాల వలన జీవితంలో అభివృద్ధికి అవకాశాలను చూడలేని వారెందరో! అందుచేత ప్రతి యువకుడు తనకు పరిమితులు విధిస్తున్న విశ్వాసాలేమిటో ఆత్మ పరిశీలన ద్వారా, వివిధ వ్యక్తిగత వికాస సిద్ధాంతాలు చెప్పే సూత్రాల ద్వారా అర్థం చేసుకోవటానికి, అధిగమించటానికి ప్రయత్నించాలి. ఈ ప్రయత్నం మాత్రమే వారి ముందు నూతన జీవిత సాక్షాత్కారం చేయగలదు. తెరల మాటున దాగి వున్న అవకాశాలను అందుకొనే ఎత్తులకు ఎదగనివ్వగలదు.



నీవు ఒక జీవిత ప్రత్యేక సందర్భంలో, నీ చుట్టూ వున్న ఇతరులు చూస్తున్నదానిని మాత్రమే చూస్తున్నావు అంటే; నీవు నీ చుట్టూ వున్న సంస్కృతికి బలి అవుతున్నావన్నమాట.

\- ఎస్.ఐ. హాయవాకా



10

# నిరంతర విద్యార్థి

'పాఠశాలను నీ విద్యా సముపార్జనకు ఆటంకం కానీయకు' అనే ప్రముఖ నానుడి వుంది. నాకిప్పటికీ గుర్తు. నేను యూనివర్శిటీలో నా విద్యాభ్యాసం పూర్తిచేసిన తరువాత ఒక పెద్దాయనకు చేతిలో పుస్తకాలతో కనపడ్డాను. ఆయన నన్ను ఏం చదువుతున్నావు అని అడిగారు. ఎం.బి.ఎ పరీక్షలు వ్రాశాను (డిగ్రీల) విద్యాభ్యాసం అయిపోయిందని నేను జవాబిచ్చాను. మరి చేతిలో ఆ పుస్తకాలు ఏమిటని ఆయన ప్రశ్నించారు. ఇదేమంత ఆశ్చర్యకరమయిన ప్రశ్న

కాదు. చదువునీ, విజ్ఞాన సముపార్జననూ (?) పాఠశాలకో, లేదా కళాశాలకో ముడిపెట్టే దుస్థితిలో నేడు సమాజం వుంది. పుస్తకాలు కాలేజీ విద్యతో వదిలేసేవేనని అటు తరువాత *"ఆచరణాత్మక"* జీవితం వేరనీ ప్రగాఢ దురభిప్రాయం సమాజంలో నాటుకొని వుంది.

అయితే నేటి నిరంతరం మారుతున్న పోటీ ప్రపంచంలో జీవితకాల విద్యార్థి కానివారు మనుగడ సాగించలేరు. దీనికి మించి మన కళాశాలల్లో విద్యకు, వాస్తవ జీవితానికీ మధ్య సరైన లింకు లేకపోవటం మరో పెద్ద సమస్య. అందుచేతనే యువతీ యువకులారా! కళాశాల జీవితంతో అధ్యయనానికి చరమాంకం పాడవద్దు. పైన పేర్కొన్నట్లు పాఠశాలను మీ విద్యకు ఆటంకం కానీయకండి. విద్యార్థి జీవితాన్ని క్యాంపస్ వెలుపలి, పాఠ్య గ్రంథాల వెలుపలి అంశాలను నేర్చుకోవటంలో, జీర్ణించుకోవటంలో సద్వినియోగం చేసుకోండి.

ఇక్కడ కళాశాల జీవితానుభవానికి సంబంధించిన మరో వైరుధ్య భరిత ధృక్పధాన్ని కూడా చూద్దాం. జీవితంలో కళాశాల జీవితాన్ని పూర్తి చేసినవారు తదనంతర కాలంలో మీ జీవితంలో ఏవి ఆనందభరిత దినాలని ప్రశ్నించినప్పుడు పలు సందర్భాలలో "కాలేజీ రోజులే" నని చెబుతుంటారు. మరో ప్రక్క ఇటువంటి వారే కష్టపడి చదివాం జీవితంలో మాకు లభించినది ఏమిటని వాపోతుంటారు. అయితే ఈ రెండింటిలో వాస్తవానికి ఏదో ఒకటే నిజం కావాలి. నేడు కళాశాలలలో కష్టపడి అధ్యయనం చేసే వారికంటే, కాలక్షేపం చేసేవారే ఎక్కువ అనేది నేను గమనించిన విషయం. యువతరం ముఖ్యంగా విద్యార్థులు ఈ స్తబ్దత నుంచి బయట పడాలి. జీవితం తుదకు సుఖంకోసం చేసే సుదీర్ఘ ప్రయాణంగా చూడరాదు. జీవితం సుఖంకోసం ప్రయాణం కాదనీ,

*నిజమైన విద్యావంతుడంటే నేర్చుకోవటం ఎలాగో నేర్చుకున్నవాడు, నిరంతరంగా పరిణతి చెందడం ఎలాగో నేర్చుకున్నవాడు మాత్రమే. - కారల్ రోగర్స్*

అది అనుక్షణం ఆనంద భరితమేనని గుర్తించాలి. అధ్యయనంలో, అన్వేషణలో జీవితపు ఆనందాలను చూడగలగాలి.

వ్యక్తి అనుభవసారమే జీవితమని, అధ్యయనం అవసరాన్ని కొట్టిపడవేసేవారూ వుంటారు. వీరికి నాదో చిన్న మనవి. మీరు జీవితంలో పలు కష్ట నష్టాలకోర్చి పైకి ఎదిగారనుకుందాం. ఈ మీ జీవితానుభవాన్ని ఇతరులతో పంచుకునేందుకు, మీ జీవిత చరమాంకంలో ఒక పుస్తకాన్ని వ్రాశారనుకుందాం. మీ తరువాతి తరంవారు అధ్యయనంతో పని ఏమిటని మీరు భావించినట్లుగానే భావించి ఆ పుస్తకాన్ని చదవటానికి తిరస్కరిస్తే మీరు ఆ అభిప్రాయంతో ఏకీభవించగలరా? ఇదే మనముందు తరంవారి, మన తరంలోని మేధావుల పుస్తకాలకు కూడా వర్తిస్తుంది. ఆ పుస్తకాలు వారు అనుభవించిన జీవిత సారం. వారు జీవితంలో పైకి రావటంలో చేసిన కృషి, ఎదుర్కొన్న ఒడిదుడుకుల పాఠం.

అంటే మనం ఓ మహావ్యక్తి పుస్తకం చదవటం ద్వారా ఆతని జీవితపు అనుభవాల తాలూకు సారాన్ని గ్రహించ గలుగుతాం. దీని అర్థం మనం చదివే ప్రతి మంచి పుస్తకం మన జీవితానికి, మరో జీవితపు మొత్తం సారాన్ని జోడిస్తుంది. ఇలా మన పరిమిత జీవితకాలం వాస్తవానికి పదింతలు, నూరింతలు ఇనుమడిస్తుంది. అందుచేత నిరంతర అధ్యయనం జీవితానికి ఆలంబన. అది మాత్రమే మనలను మానసికంగా చివరి వరకూ సజీవంగా వుంచగలదు.

జీవితంలో పరిపూర్ణుడు కావడానికి నేర్చుకోవలసింది చాలా వుంటుంది. ఈ నేర్చుకోవడం ప్రధానంగా అధ్యయనం (పుస్తకాలు), జీవితంలో ఎదురయ్యే వడిదుడుకులు, మన చుట్టూ ఉన్న మనుష్యుల

> జీవితంలో నిజమైన విద్య స్వీయ విద్యే.
>
> - ఐజాక్ అసిమోవ్

ద్వారా జరుగుతుంది.

అయితే ఈ మొత్తం అధ్యయనాలకు ఒక పరిమితి వుంది. అది మనం అధ్యయనం చేసినదాన్ని, దాని వాస్తవికమైన రూపంలో ఎంతమాత్రం గ్రహించగలుగుతున్నామనేది? దీనికొక ఉదాహరణగా ఒక సినిమాలో విలన్ తన బండారం బయటపెడుతూ పత్రికలలో వచ్చిందన్న వార్తకు ప్రతి స్పందనగా, పత్రికలు చాలామంది చదువుతారు కాని అవి అర్థమయ్యేది కొందరికేనంటాడు. ఈ ఉదాహరణ జీవితంలో పలువురు అధ్యయనశీలురమనుకునే వారికి కూడా వర్తిస్తుంది. అధ్యయనం చేసిన దాన్ని వ్యక్తిత్వంలో ఇముడ్చుకోవడంలో మౌలిక పునాదిగా వ్యవహరించే మానసిక దృక్పథం ఇక్కడ కీలక పాత్ర వహిస్తుంది. *సరైన మానసిక దృక్పథాన్ని ఏర్పరుచుకోవడానికి తగినంత ఆత్మవిమర్శ, విమర్శను సరిగా రిసీవ్ చేసుకోవడం తప్పనిసరి.*



*భవిష్యత్ ప్రపంచంలో, నేర్చుకోవటం ఎలాగో నేర్చుకోనివాడే నిరక్షరాస్యుడు.*

*- ఆల్విన్ టాఫ్లర్*



11

# లక్ష్యానికి ప్రాధాన్యతను ఇవ్వండి

మనలో చాలామందికి జీవితంలో విజయానికి సంబంధించిన గొప్ప లక్ష్యాలు వుండవచ్చు. అయితే మనలోని పలువురు ఈ లక్ష్యాల సాధనకు తగినంత కృషిచేసే చొరవ చూపరు. దీనికి ఒక ప్రధాన కారణం చాలా మందిలో వుండే మానవ సంబంధాల బలహీనత. మనం మన చుట్టూ వున్న మనుష్యులతో శృతిమించి Emotional గా involve అయితే ఏర్పడేదే ఈ బలహీనత. దీనర్థం మనం మన లక్ష్యాల కోసం మన మిత్రులు, శ్రేయోభిలాషులను పూర్తిగా

తిరస్కరించాలని కాదు. కానీ మన వ్యక్తిగత జీవిత బాంధవ్యాలు మన లక్ష్యాల సాధనకు ఆటంకం కలిగించే మోతాదులో వుండరాదనేది. దీనికో చక్కని ఉదాహరణ చూద్దాం.

రష్యా విప్లవ అధినాయకులుగా లెనిన్ ట్రాట్స్కీలు పలువురికి సుపరిచితులే. కాగా రష్యా విప్లవానంతరం అంతర్యుద్ధ సమయంలో పలువురు కమ్యూనిష్టు కార్యకర్తలు, నాయకులు సైతం ఆత్మహత్యలకు పాల్పడ్డారు. తాము విప్లవానికి ముందు నూతన సమాజం గురించి కన్న కలలు కల్లలవుతున్నాయనే ఆవేదనలో వారు జీవితాన్ని ముగించాలనే ఈ తీవ్ర నిర్ణయాన్ని తీసుకున్నారు. ఇలా ఆత్మహత్యకు పాల్పడిన ఒక వ్యక్తి లెనిన్ కుడి భుజం వంటి ట్రాట్స్కీకి ఒక లేఖ వ్రాశాడు. దాని సారాంశం ఇది : నువ్వు (ట్రాట్స్కీ ని వుద్దేశించి) తనకంటే కూడా తెలివైనవాడివని లెనిన్ స్వయంగా పలుమార్లు అంగీకరించాడు. అయితే లెనిన్ విజయాల వెనుక, నీ పరాజయాల (గతంలో) వెనుక ఒక ప్రధాన కారణం వుంది. లెనిన్ తన అభిప్రాయాలు సరైనవని భావించినప్పుడు తనతో విభేదించిన ఇతరులతో తెగతెంపులు చేసుకోవడానికి ఎప్పుడూ వెనకాడలేదు. అలా లెనిన్ పలుమార్లు ఒంటరి అయ్యాడు. అయితే ఆయన అభిప్రాయాలను చరిత్ర ధృవీకరించి నప్పుడల్లా ఆయన మరింత బలవంతుడుగా (హెచ్చుమంది అండతో) పై కొచ్చాడు. కాగా నీవు (ట్రాట్స్కీ) నలుగురి మన్నన కోసం వారి తప్పుడు అభిప్రాయాలతో, తెలిసీ, రాజీ పడుతూ వచ్చావు. అందుచేతనే నీవు మందీ మార్బలంతో ఆరంభించి, చివరకు అన్ని పోరాటాలలోనూ ఒంటరిగా మిగిలావు. (ట్రాట్స్కీ లెనిన్ మరణానంతరం, స్టాలిన్‌తో

> నీలోని మిత్రుడు, ఫలానాది చేయమని చెప్పినప్పుడు, వెలుపలి మిత్రులమాట వినకు.
>
> \- మహాత్మా గాంధీ

జరిగిన అధికార పోరులో ఓడిపోయి, తుదకు ప్రవాసంలో హత్యకు గురయ్యాడు - రచయిత)

పైన పేర్కొన్న వాస్తవ ఉదాహరణ జీవితంలో మనం, వ్యక్తులకు కాక సరైనవని నమ్మిన అభిప్రాయాలకు హెచ్చు ప్రాధాన్యతను యివ్వాలని రుజువు చేస్తుంది. వ్యక్తిగత జీవితంలో సన్నిహితులు, "శ్రేయోభిలాషు"లతో వచ్చే పొరపొచ్చాలకు భయపడి పలువురు తాము సరైనవని మనసా వాచా నమ్మిన లక్ష్యాల విషయంలో రాజీపడిపోతారు. తమ దూరదృష్టిని తక్షణ మానవ సంబంధాల ప్రయోజనం కోసం పణంగా పెడతారు. దీనివలన వారు జీవితంలో ఉన్నత శిఖరాలకు ఎదిగే అవకాశాన్ని చేజార్చుకుంటారు. పరాజయం పాలవుతారు.

ఒక రకంగా ఆలోచిస్తే వారి రాజీ ధోరణి వారి "శ్రేయోభిలాషు" లకు పరాజయాన్నే కానుకగా ఇచ్చింది. అలాకాక ఈ వ్యక్తులు తమ స్వీయ నిర్ణయాలకు కట్టుబడి, దీక్షతో విజయం సాధిస్తే అది వారి శ్రేయోభిలాషులకు కూడా విజయమే కదా, కాబట్టి రాజీపడి మీరు ఓడి, మీ శ్రేయోభిలాషులను సైతం వారు భయపడుతున్న మీ వ్యక్తి పరాజయంలో భాగం చేయడమా! లేదా దూరదృష్టితో, స్వతంత్రంగా వ్యవహరించి మీరు గెలిచి తద్వారా మీ సన్నిహితులకు పరోక్షంగా విజయాన్ని అందించడమా అన్నదే మీ ముందున్న సమస్య. ఇక తేల్చుకోవడం మీ వంతు.



> జీవితానికి ఒక పరమావధిని కలిగి ఉండడమే మానవుని ఉనికి యొక్క నిజమైన రహస్యం. - దాస్తొవిస్కీ

ఈ చిత్రాన్నిచూసి అది ఎలా గోచరిస్తుందో మీకు మీరు జవాబు ఇచ్చుకోవటానికి ప్రయత్నించండి. ఇది మీ తెలివి తేటలకు పరీక్ష ఏ మాత్రం కాదు. మీరు ఊహించిన జవాబును ఓ పక్కన వ్రాసుకోండి. తరువాతనే ఈ క్రింది మానవ మస్తిష్కం తాలూకూ మిష్టరీని చూడండి.

ఈ చిత్రాన్ని చూసిన పలువురిలో అధిక సంఖ్యాకులు దానిని శిలువగుర్తుగానో లేదా ప్లస్ గుర్తుగానో చెబుతారు. అయితే ఈ చిత్రంలో ఐదు సమాన చతురస్రాలున్నాయని కొద్దిమంది మాత్రమే చెబుతారు. ఇది ఒక సాధారణ చిత్రానికి సంబంధించిన ప్రశ్న. అయితే మానవ స్వభావం సహజంగా సరళీకృత జవాబులను, నమూనాలను ఎంచుకుంటుందనడానికి ఇది ఒక చిన్న ఉదాహరణ.

కానీ వాస్తవానికి మానవ సమాజం, జీవితం సంక్లిష్ట మయినవి. ఈ సంక్లిష్ట జీవితాన్ని, సమాజాన్ని, సరళీకృత రూపంలో అర్థం చేసికొనేందుకు వ్యక్తి ప్రయత్నిస్తాడు. మానవ స్వభావంలోని ఈ మౌలిక లక్షణమే అతనికి కొన్ని మార్లు వరంగానూ, మరికొన్నిమార్లు శాపంగానూ పరిణమిస్తుంది.

జీవిత క్లిష్టతనంతా యథాతథంగా గ్రహిస్తే మానవుడు నిర్దిష్టంగా, ఆత్మ విశ్వాసంతో నిర్ణయాలు చేసికోలేని సందిగ్ధ స్థితిలో పడిపోతాడు. ఈ రకంగా ఆలోచిస్తే ఈ సరళీకరణ మానవునికి వరం. అయితే మానవుని జీవితంలో ఎదురయ్యే పలు సందేహాలకూ, స్పర్ధలకూ కూడా ఈ సరళీకరణే కారణంగా వుంటుంది. సంక్లిష్ట వాస్తవంలోని అన్ని కోణాలనూ అర్థం చేసుకోలేని మనిషి వాస్తవానుగుణమయిన నిర్ణయాలు చేసుకొనే అవకాశం తగ్గిపోతుంది. ఇది వ్యక్తి పాలిటి శాపం. అయితే ఈ వాస్తవాన్ని చైతన్యయుతంగా గుర్తించి జీవిత నిర్ణయాలు తీసుకొనే

> పరిపూర్ణ సత్యం దాని విడి విడి అంతర్భాగాల కంటే సరళంగా వుంటుంది.
>
> \- విల్లార్డ్ గిబ్స్

టప్పుడు మామూలు కంటే మరింత సమగ్రంగా, విస్తృతంగా సమాచారాన్ని సేకరించటానికి, క్రోడీకరించుకోవటానికి ప్రయత్నం చేస్తే ఎక్కువ సత్ఫలితాలను సాధించవచ్చు. అందుచేత మన జ్ఞానేంద్రియాలు అందించిన తక్షణ సమాచారం పైనే కాక, మొత్తం సమస్య భిన్న దృక్కోణాలను వెలుగులోనికి తెచ్చేందుకు ప్రయత్నం చేయాలి. ఈ సందర్భంలో జీవితాన్ని వివరించే సిద్ధాంతాల గురించి గేథే చెప్పిన ఒక చిన్న కవితను చూద్దాం.

"All theories are grey my friend
only lifes golden tree is green."

అంటే సిద్ధాంతాలన్నీ బూడిద రంగువేనని, అవి జీవితపు పచ్చని వృక్షానికి ఏనాడు సాటి కాదని వుద్దేశ్యం. అందుచేత వ్యక్తులు సిద్ధాంతాలను గుడ్డివాదాలుగా మార్చి అదే వాస్తవమన్నట్లు వ్యవహరించ రాదు. ఆచరణలో వెసులుబాటు లేని సిద్ధాంతాలు జీవితాన్ని పరిపూర్ణ సత్యంతో నిర్వచించలేవు. కాగాపోగా అవి జీవితాన్ని వక్రీకరిస్తాయి.

Men are born soft and supple;
Dead, they are stiff and hard,
Plants are born tender and pliant;
Dead, they are brittle and dry.

Thus who ever is stiff and inflexible
Is a disciple of death,
whoever is soft and yielding
Is a disciple of life...
- Lao-tzu.





13

# 'సమస్య' కేంద్ర బిందువు కారాదు

ఏదయినా సంక్లిష్ట పరిస్థితి ఎదురయినప్పుడు మానవులలో హెచ్చుమంది ఆ సమస్య తాలూకు భిన్న దృక్కోణాలనూ పరికించి వేదన చెందటంలో మునిగి పోతారు. దీనిలో వారు సమస్యకు "కారణమయిన" ఇతరులను నిందించుకొంటూ కాలం వెళ్లబుచ్చుతారు. అయితే ఈ దృక్పథం మనకు ఎదురయ్యే సమస్యలకు పరిష్కారం కాదు.

సమస్య ఎదురయినప్పుడు మన సమయంలో అత్యధిక భాగాన్ని

ఆ సమస్యకు పరిష్కారాన్ని కనుగొనే దిశగా మళ్లించాలి. జీవితంలో ఈ నియమానికి కట్టుబడి పనిచేయగలిగితే మన జీవిత స్వరూప, స్వభావాలే పూర్తిగా మారిపోయే అవకాశం వుంటుంది. అయితే దీని అర్థం సమస్య వెనుక వున్న కారణాలను గురించిన పరిశీలనను నిర్లక్ష్యం చేయమని కాదు. అలాగే జీవితంలో మనం పలు ఒడిదుడుకులను వైఫల్యాలుగా కాక, జీవిత గుణపాఠాలుగా చూస్తే మనం మరింత లాభపడతాం.

సమస్యను వైఫల్యంగా చూసినంతసేపూ మనకు మిగిలేది నిరాశా నిర్లిప్తతే. అలా కాకుండా దానిని ఒక పాఠంగా తీసుకుంటే మనం ముందు ముందు మరింత అప్రమత్తంగా వ్యవహరిస్తాం. జీవితంలో విజయానికి ఇది తప్పనిసరి షరతు. దీనికి అద్భుతమైన ఉదాహరణకే అమెరికా మాజీ అధ్యక్షుడు అబ్రహం లింకన్ జీవన యాత్ర.

ఆయన తన :

☆ 31 వ ఏట వ్యాపారంలో దెబ్బతిన్నాడు.

☆ 32 వ ఏట చట్టసభ ఎన్నికలలో పరాజయం పొందాడు.

☆ 34 వ ఏట మరలా వ్యాపారంలో దెబ్బతిన్నాడు.

☆ 35 వ ఏట తన జీవిత సహధర్మచారిణిని కోల్పోయాడు.

☆ 36 వ ఏట డిప్రెషన్‌కు లోనయ్యాడు.

☆ 38 వ ఏట మరోమారు ఎన్నికలలో ఓడిపోయాడు.

☆ 43 వ ఏట అమెరికా కాంగ్రెస్‌కు పోటీ చేసి ఓడిపోయాడు.

☆ 46 వ ఏట మరలా కాంగ్రెస్‌కు పోటీ చేసి ఓడిపోయాడు.

☆ 48 వ ఏట 3వ సారి కాంగ్రెస్‌కు పోటీ చేసి ఓడిపోయాడు.

నిజమైన విజయాలను సాధించే వ్యక్తి తన వైఫల్యాల నుంచి పాఠాలు నేర్చుకుంటాడు. భిన్న మార్గంలో మరలా ప్రయత్నాన్ని ఆరంభిస్తాడు. - డేల్ కార్నెగీ

- ★ 55 వ ఏట సెనెట్‌కు పోటీ చేసి ఓడిపోయాడు.
- ★ 56 వ ఏట ఉపాధ్యక్ష పదవికి పోటీ చేసి విఫలమయ్యాడు.
- ★ 58 వ ఏట మరలా సెనెట్‌కు పోటీలో ఓటమి పాలయ్యాడు.
- ★ 60 వ ఏట అమెరికా అధ్యక్షునిగా ఎన్నిక అయ్యాడు.

ఈ జీవిత చరిత్ర, పైన మనం చెప్పుకొన్న జీవిత ఒడిదుడుకులను అంతిమ వైఫల్యాలుగా కాక, గుణపాఠాలుగా చూసే పాజిటివ్ మనస్తత్వానికి అద్భుతమైన ఉదాహరణ.



> 'అసాధ్యం' అనేది మూర్ఖుల పదజాలంలో మాత్రమే కనిపించే మాట.
>
> \- నెపోలియన్



14

# గతం క్రీనీడలు

వ్యక్తుల జీవితాలలో వారి గతం తాలూకూ, ముఖ్యంగా బాల్యం తాలూకూ ప్రభావాలు కీలక పాత్ర వహిస్తాయి. మనలో దోబూచులాడే పలు అనర్థదాయక తీరు తెన్నులకు మన బాల్యంలోనే పునాదిపడే అవకాశం కూడా హెచ్చుగా వుంది. అందుచేత వ్యక్తిగత పురోభివృద్ధిని సాధించాలనుకుంటున్న వ్యక్తి ముందుగా తన బాల్యం, దాని తాలూకూ దుష్ప్రభావాలను అధిగమించటం అవసరం. ఈ విషయంలో ఫ్రాయిడ్ వంటి పలువురు మానసిక శాస్త్రవేత్తల గ్రంథాలు

ఉపకరిస్తాయి. అలాగే ఈ బాల్యం తాలూకూ దుష్ప్రభావాలనుంచి బయట పడేందుకు "న్యూరో లింగ్విస్టిక్ ప్రోగ్రామింగ్" వంటి నూతన టెక్నిక్స్ ఉపయోగపడతాయి. అయితే ఈ కిటుకులు ఏవీ మనం మొదటి పుటలో చెప్పుకున్న వ్యక్తిగత అభివృద్ధి సూత్రాలకు, నియమాలకు ప్రత్యామ్నాయాలుకావు.

"న్యూరో లింగ్విస్టిక్ ప్రోగ్రామింగ్" గతం తాలూకూ దుష్ప్రభావాలనూ అధిగమించేందుకు సూచించే ఒక చిన్న టెక్నిక్‌ను ఇక్కడ చూద్దాం. ఆంథోని రాబిన్స్ రచించిన "అవేకన్ ది జయింట్ వితిన్" నుంచి ఈ ఉదాహరణను చూడండి.

మీ చిన్న తనంలో మీ తండ్రిగారు మిమ్మలను కించపరిచే మాటలు అనటం ద్వారా మీలో ఆత్మన్యూనతకు కారణం అయ్యారు అనుకుందాం. అయితే యుక్త వయస్సు వచ్చాక మీరు ఆ పరిస్థితిని గుర్తించి మారాలనుకుంటారు. దీనికి గాను మీరు ముందుగా ఒక ప్రశాంతమయిన ప్రదేశంలో రిలాక్స్‌డ్‌గా కూర్చోండి.

ముందుగా మీకు జరిగిన అవమానం తాలూకూ కించపరిచే ఘటనను ఒక సినిమాలా చూడండి. ఇది ఎటువంటి బాధకు లోనవ్వకుండా చేయాలి. ఇలా ఒకసారి చేసిన తరువాత, నిండుగా గాలి పీల్చుకుంటూ, అపహాస్యపూరిత ముఖకవళికలతో మీకు జరిగిన అవమానాన్నంతా రివర్స్‌లో జరుగుతున్నట్లు ఊహించుకోండి. అంటే మిమ్మల్ని కించపరిచిన వారు వారి మాటను వారే మ్రింగు కుంటున్నట్లు ఊహించుకోండి. ఈ దృశాన్ని చాలా వేగంగా రివర్స్‌లో ఊహించుకోండి. మరలా అదే దృశ్యాన్ని మరింత వేగంగా అది జరిగిన క్రమంలో ఊహించుకోండి. తరువాత మిమ్మల్ని అవమానించినవారిని ఆ సందర్భంలో ఊహించుకొంటున్నప్పుడు

మనుషుల్లో చాలామంది పసిపిల్లలని తెలుసుకుంటే నీకు అన్ని విషయాలూ తెలిసినట్లే లెక్క. — సామెత

వారిని ఒక పెద్ద ముక్కో, లేదా పెద్ద పెద్ద చెవులో ఉన్న కార్టూన్ బొమ్మగా చూడండి. ఆ నవ్వును తెప్పించే రీతిలో వున్న వ్యక్తి మిమ్మ లను కించపరిచిన ఘటనను పైన పేర్కొన్నట్లుగా పలుమార్లు ముందుకూ, వెనకకూ క్యాసెట్ టేప్‌లా కదలనీయండి. ఇది ప్రతిసారీ మరింత వేగంగా జరగాలి. అలా కనీసం ఓ డజను సార్లు చేయండి. దీనివలన మీలో గూడుకట్టుకు పోయిన బాల్యంలోని ప్రభావాలు కేసెట్‌లో రికార్డు అయివున్న చిత్రాలు అరిగిపోయినట్లు మటుమాయం అవుతాయి. ఇలాంటి పలు టెక్నిక్‌లను నేర్చుకునేందుకు మీకు "న్యూరో లింగ్విస్టిక్ ప్రోగ్రామింగ్" సహాయపడుతుంది. తత్వవేత్త అయిన జిడ్డు కృష్ణమూర్తి రచనలు చదవటం కూడా గతం నుంచి విముక్తికి బాగా సహకరిస్తుంది.



> గతాన్ని గుర్తుపెట్టుకోలేనివారు తిరిగి గతాన్ని అనుభవించాల్సి వుంటుంది.
>
> \- జార్జి శాంతాయనా




15

# స్వేచ్ఛ - పెత్తనం చేయటం

ఇతరులపై పెత్తనం చేసేవారు తాము కూడా స్వేచ్ఛా జీవులుగా వుండలేమనేది గుర్తించాలి. ఇతరులపై పెత్తనం సాగాలంటే వారిపై నిరంతరం ఒక కన్ను వేసి వుంచాలి. అంటే పెత్తనం చేసే వ్యక్తి తన కాలం, ఆలోచన మొత్తం పెత్తనం చేయబడే వ్యక్తిపై కేంద్రీకరించాలి. ఇది ఈ రెండు పక్షాల స్వేచ్ఛకు, వికాసానికి హాని చేస్తుంది. కాబట్టి *పెత్తనం చేయటం కంటే, ఇతరులను ప్రభావితం చేసి (తన ప్రవర్తన,*

కార్యాచరణద్వారా) వారికి నాయకత్వం వహించేందుకు ప్రయత్నించాలి. అన్ని నదులూ తమకంటే పల్లంలో వున్న సముద్రంలోకి ప్రవహిస్తాయి. అలాగే జీవితంలో నాయకపాత్ర వహించాలంటే వినమ్రత, వినయం అవసరం.

ప్రపంచంలో నీటికంటే మృదువైనది, తలవగ్గేది (yielding) మరేదీ లేదు. అయితే అత్యంత కఠినమైన లోహాలను సైతం దీర్ఘకాల ప్రయత్నంలో అది కరిగించగలదు. ఈ మౌలిక సూత్రాన్ని వ్యక్తిత్వ వికాసం కోసం ప్రయత్నించే ప్రతివారూ గుర్తించుకోవాలి.

కొందరు ఇతరులపై పెత్తనం చేసే ప్రక్రియలో తమస్వేచ్ఛను కోల్పోతారని చెప్పుకున్నాం. ఇదే కాకుండా పెత్తనం చేయటం ద్వారా మరో వ్యక్తి నుంచి పరిపూర్ణ సహకారాన్ని, పనికి సంపూర్ణ కమిట్‌మెంట్‌ను కూడా సాధించలేం. దానికి ఉదాహరణగా ఒక యజమాని తన పనివానికి ఒక తోటలో ఉన్న చెట్లను కొట్టి వేయమని ఆదేశాలు యిచ్చాడనుకొందాం. కాగా ఆ పని వాడు తనపై "రుద్ధబడిన" ఆ పనిని సంపూర్ణ స్వేచ్ఛయుత మానవుడు చేసినట్లు చేయలేడు, చేయడు. యజమాని తనకి అప్పగించిన పనిని చేయటంలో ఆ పనివాడు విచక్షణారహితంగా వ్యవహరిస్తాడు. అంటే అతడు తోటలోని పనికిరాని పిచ్చి మొక్కలతో పాటు, ఫలాలనిచ్చే వృక్షాలను కూడా నరికివేస్తాడు. అతనికి కావలసిందల్లా పనిని పూర్తిచేయటం లేదా ఆ రోజు వేతనాన్ని ఎలాగోలా సంపాందించుకోవటం. అందుచేత సమాజంలో అందరూ స్వేచ్ఛాయుతంగా, మనసా, వాచా, కర్మణా తమ విధులను నిర్వహించాలంటే మనుష్యులు ఒకరిపై ఒకరు

> ఇతర జాతులను బానిసలుగా చేసే ఏ జాతీ స్వేచ్ఛగా ఉండజాలదు.
> \- కారల్‌మార్క్స్

పెత్తనం చేసే పరిస్థితి ఉండరాదు. ఇది మొత్తం సమాజానికే కాక, దానిలోని అంతర్భాగమయిన వ్యక్తుల వికాసానికి కూడా అవరోధం అవుతుంది.

ఈ వాస్తవాన్ని గుర్తించిన నేటి ఆధునిక సమాజాలు తన పనిని చేయటంలో వ్యక్తికి ఉన్న స్వేచ్ఛను విస్తృత పరుస్తున్నారు. తమ పరిశ్రమలలో పురమాయింపు, పెత్తందారీ ధోరణులను పరిత్యజిస్తున్నాయి. దానిలో అంతర్భాగమే ఇంటిలో కూర్చునే తన ఆఫీసు పనులను చేసే తరహా అవకాశాలను కల్పించటం. ఆధునిక కమ్యూనికేషన్ సాంకేతిక పరిజ్ఞానం (ఇంటర్‌నెట్ వంటివి) దీనిని సాధ్యం చేస్తుంది.



తమను తమ భయాల నుండి విముక్తి చేసేందుకు నల్లజాతివారికి, తెల్లజాతివారు అవసరం. అలాగే తమ అపరాధ భావం నుండి విముక్తి పొందేందుకు తెల్లజాతి వారికి నల్లజాతివారు అవసరం. - మార్టిన్ లూథర్ కింగ్ జూనియర్




16

# సగటుదనం - పెనుముప్పు

మానవుడు సంఘజీవి అన్నది తిరుగులేని వాస్తవం. సంఘజీవి కావటం ద్వారా మానవుడు పలు ప్రయోజనాలను పొందగలుగుతాడు. అయితే ఈ ప్రయోజనాలతోపాటుగా సంఘజీవిగా వుండే ప్రక్రియలో వ్యక్తి ఎదుర్కొనే కొన్ని సమస్యలు కూడా వున్నాయి. వీటిలో ప్రధానమైనది వ్యక్తి సగటు మనిషిగా మారిపోవటం. అంటే వ్యక్తి తన పూర్తి శక్తిసామర్థ్యాల మేరకు వికసించకుండా అడ్డుకట్టలు ఏర్పడటం.

పైన పేర్కొన్నదానికి ఒక సాధారణ ఉదాహరణనే చూద్దాం. మీరు ఒక జనసమ్మర్ధం ఎక్కువగా వున్న రోడ్డుపై నడుస్తున్నారు అనుకోండి. అలాంటి రోడ్డుపై మీరు మధ్యలో ఆగిపోలేరు. అలా ఆగిన పక్షంలో రోడ్డుపై నడిచే యితరులకు మీరు ఆటంకం అవుతారు. అలాగే ఆ రోడ్డుపై మీరు వేగంగా కూడా నడవలేరు. రోడ్డుపై మీ ముందర నడిచే యితరులు నడిచే వేగం మీ వేగాన్ని కూడా పరిమితం చేస్తోంది. ఇదే సూత్రం సంఘజీవి అయిన మానవుని మేధోవికాసంలో కూడా చాలామేరకు వర్తిస్తుంది. ఇతరులతో అన్నివిధాల పోల్చి చూసుకునే మానవ నైజం ఈ ప్రక్రియకు పునాది అవుతుంది.

ఈ పై కారణం వలననే సమాజంలో అటు మేధావులు, ఇటు బుద్ధిమాంద్యులు వున్నదానికంటే సగటు మనుషుల సంఖ్య అత్యధికంగా వుంటుంది. దీనినే పలువురు మేధావులు సగటు మనిషిగా కుదించివేయబడటం తాలూకు ఉచ్చుగా (MEDIOCRITY TRAP) పేర్కొంటారు. మానసిక వికాసానికి ఈ ఉచ్చు నుంచి బయటపడటం తప్పనిసరి.

చుట్టూ వున్న సమాజం వ్యక్తిని నిరంతరం అసంపూర్ణుడిగానూ, భయంతో జీవించే వాడిగానూ, ఇతరుల మెప్పుకోసం తాపత్రయపడే వాడిగానూ కట్టి పడవేయచూస్తుంది. సమాజంలో యథాతథ స్థితిని; నిశ్చల, నిశ్చితంగా చూపచూస్తుంది. మేధో వికాసాన్ని కోరుకునే వారు ఈ మానసిక అడ్డుగోడలను అధిగమించాలి. అంటే సామాజికంగా చురుకైన జీవితం గడుపుతూనే, వ్యక్తిగతంగా విముక్తి కావాలి. ప్రక్క మనుష్యుల తాలూకూ కార్బన్ కాపీగా ఉండేందుకు నిరాకరించాలి.

సమాజం స్వేచ్ఛా మానవుడి పాలిటి అతిపెద్ద శత్రువు. కాగా

ఉక్కు మనిషి ఎవడో, ఊక మూట ఎవడో,
కష్టకాలమందే స్పష్టపడును, ఉత్తవేళలందు ఉత్తములందరూ. — నార్ల

స్వేచ్ఛా మానవుడు సమాజానికి అత్యున్నత మిత్రుడు. ఒక జీసస్‌ని, ఒక సోక్రటీస్‌ని, ఒక గెలీలియోని సమాజం ఏవిధంగా చూసిందో వేరే చెప్పనవసరంలేదు. అయితే ఈ మహాపురుషులు మానవజాతికి వర ప్రసాదాలు. సమాజంలో గుర్తింపును, ప్రత్యేకతను కోరుకునే వ్యక్తి మనస్తత్వమే అతనిని సమాజంలో బానిసగా, సగటు మనిషిగా కట్టి పడవేస్తోంది. కాబట్టి ఈ సామాజిక ఉచ్చు నుండి బయటపడి, అదే సమయంలో తనకు జ్ఞానాన్ని అందించిన సమాజానికి ప్రేమను పంచటం ఉన్నత మానవుల లక్ష్యం.

సమాజ ప్రయోజనాలను విస్మరించిన స్వీయ, సంకుచిత ప్రయోజనాలు మానసిక వికాసానికి దోహదపడవని వ్యక్తి గుర్తించాలి. ఓ పక్క సంఘజీవిగా వుంటూనే మరోపక్క సంఘం విధించే సగటు తనపు పరిమితులను అధిగమించడమే నిజమైన మానసిక వికాసానికి తొలిమెట్టు.



కొందరు సగటు మనుషులుగా జన్మిస్తారు, కొందరు దానిని సాధిస్తారు, మరికొందరిపై అది రుద్దబడుతుంది. - జోసెఫ్ హెల్లర్




17

# భౌతిక భోగలాలసత్వం

నేడు ప్రపంచ వ్యాప్తంగా యువతరాన్ని ఆవహిస్తున్న పెనుభూతం కన్స్యూమరిజం. అంటే జీవిత భౌతిక భోగలాలసత్వాల వెంపర్లాట. ఇది యువకుల మస్తిష్కాలను ఖాళీగా వుంచి, కేవలం వారి జేబులను నింపుతోంది. ఇది వ్యక్తి వికాసానికి ఒక ప్రధాన అవరోధం. దీని అర్థం భౌతిక సుఖాలు పరిత్యజించమనికాదు.

ఇక్కడ ప్రజల్లా భౌతిక వస్తువుల చుట్టూ మనం పరిభ్రమిస్తున్నామా, లేదా మన ప్రయోజనాల కోసం (మానసిక వికాసంతో సహా) భౌతిక

వస్తువులను వినియోగించు కొంటున్నామా అన్నది? మానవుడు భౌతిక సంపదను తన అదుపాజ్ఞలలో వుంచుకోవటం పోయి, తానే దానిముందు మోకరిల్లుతున్నాడు. భౌతిక సంపదకోసం ఈ శృతిమించిన వెంపర్లాటలోని బలహీనతల్లా, అది అడుగులేని "బావి" వంటిది. ఈ రకం తాపత్రాయానికి ముగింపు వుండదు. ఈ వెంపర్లాటలో పడిన వ్యక్తి ప్రతిదానికీ తనకున్న భౌతిక సంపదను ఇతరుల సంపదలతో పోల్చి చూసి నిరంతరంగా ఎడతెగని పోటీ పడుతుంటాడు. ఈ రకంగా మానవ జీవితానికి సుఖ శాంతులను ఇవ్వవలసిన సంపద దాని పాలిట శాపంగా పరిణమిస్తుంది. సరైన తాత్విక ధృక్పధాన్ని ఏర్పరచుకోవటం ద్వారా మాత్రమే ఇతరులతో పోల్చి చూసుకునే, ప్రతిదానిలోనూ పోటీ పడే మనస్తత్వాన్ని అధిగమించగలం. మన జీవిత విలువలు అరువు తెచ్చుకున్నవిగా గాక, స్వంతంగా విచక్షణా జ్ఞానంతో ఆలోచించి ఏర్పరచుకున్నవిగా వుండాలి. జిడ్డు కృష్ణమూర్తి, ఎరిక్‌ఫ్రామ్ వంటి వారి రచనలను అధ్యయనం చేయటం ద్వారా ఇది కొంత వరకూ సాధ్యం అవుతుంది. అయితే మీ అధ్యయనాన్ని ఈ ఇద్దరు రచయితలకే పరిమితం చేయమన్నది నా వుద్దేశ్యం కాదు. ఈ ఇద్దరు రచయితల ఉదాహరణలు మచ్చుకు మాత్రమే.

If you over value possessions,

people begin to steal.

- Lao-tzu.

అంతేకాకుండా జీవితంలో వివిధ దశలలోని ఆనందాలు, సుఖాలపై కూడా సమాజంలో దురభిప్రాయాలున్నాయి. ప్రస్తుత సమాజంలో యౌవన

సంపదల పట్ల వ్యామోహం మనలను స్వేచ్ఛగా, ఉన్నతులుగా జీవించనీయదు.
- బెర్ట్రాండ్ రస్సెల్

జీవితమే మానవ జీవిత సుఖాలకు కేంద్రబిందువుగా వుంది. యౌవన జీవిత సుఖాలను ఆస్వాదించడం కోసం జీవితాన్ని సిద్ధం చేసుకునేందుకు బాల్యాన్నీ, అటు తరువాత ఆ సుఖాలను నెమరువేసుకుంటూ గడిపే దశగా వృద్ధాప్యాన్నీ చూసే దృక్పథం వుంది. కాగా జీవితం యావత్తూ ... అనుక్షణం ... ఆనందభరితం అని మనం గుర్తించాలి.

ప్రముఖ నవలా రచయిత సోమర్‌సెట్ మామ్ చెప్పినట్లుగా : "వృద్ధాప్యంలో కూడా సుఖాలు వున్నాయి. అవి మామూలు సుఖాలకు భిన్నమైనవి కావచ్చుగానీ, యౌవన సుఖాలతో ఏమాత్రం తీసిపోనివి". *కాబట్టి జీవితానందాలను, యౌవన సుఖాలకు కుదించే వ్యక్తి అసంపూర్ణుడుగానూ, స్వార్ధపరుడుగానూ మాత్రమే మిగిలిపోతాడు.*

అయితే జీవితంలో దీర్ఘకాలిక లక్ష్యాలు, సరైన తాత్విక దృక్పథం వున్న వ్యక్తి మాత్రమే దీనికి తగిన మానసిక స్థితిని సాధించగలడు. ఈ విషయంలో సమాజంలో ప్రగాఢంగా పాతుకుపోయిన తప్పుడు భావాలను అధిగమించేందుకుగాను వ్యక్తి, తనకు తాను స్వతంత్రంగా తన ఆలోచనా ధోరణిని మలుచుకోవాలి. మానసిక దోరణులను మార్చుకోవటం ద్వారా మన మొత్తం జీవితాన్నే పరిపూర్ణంగా తీర్చిదిద్దుకోగలం.

సమాజంలో ప్రగాఢంగా నాటుకుపోయి వున్న భావాల నుంచి విముక్తి చెందకుండా ఎవ్వరం జీవితంలో అత్యున్నత విజయాలను సాధించలేరన్నది ప్రముఖ తత్వవేత్త హెగెల్ వెల్లడించిన అభిప్రాయం.

జీవిత చరమాంకంలో మరణశయ్యపై వున్న వ్యక్తి, తన జీవితం యావత్తూ సరైన దిశగానే నడిచిందని భావిస్తే అదే నిజమైన వ్యక్తిగత విజయం. ఈ భూమిపై మీ జీవితంలో మీ అంతిమ లక్ష్యాన్ని సాధించారా?

*అత్యంత ఎక్కువ సంపదలను ప్రోగుచేసుకున్నవారికి అవి పోతాయేమోనన్న హెచ్చు భయం వుంటుంది.* *- లియోనార్డో డావిన్సీ*

అని ప్రశ్నిస్తే మీరు జీవించి వున్నంతకాలం మీకు ఏదో ఒక జీవిత పరమార్థం, లక్ష్యాలు వుండే తీరాలని గుర్తించాలి. అంటే జీవితంలో లక్ష్యాలను కలిగి వుండడమే, జీవితపు సజీవతకు ఆలంబన. జీవితంలో ప్రతివ్యక్తీ సానపెట్టబడని వజ్రం లాంటివాడని గుర్తించాలి. కాగా తన జీవితానికి మెరుగులు దిద్దుకునే ప్రయత్నాన్ని వ్యక్తి తన జీవితం చివరి క్షణాల వరకు కొనసాగించాలి.

గతంలో జర్మనీని పరిపాలించిన ఒక నియంత ఉదాహరణనే చూద్దాం. ఆయన ఆనాటి రాజకీయంలో తన ప్రధాన శత్రువులు ఎవరనేది లోతుగా పరిశీలించాడు. కాగా ఈ పరిశీలన ద్వారా ఆయన తెలుసుకున్న కీలక అంశం ఏమిటంటే, తన ప్రధాన శత్రువులలో హెచ్చుమంది అరవై అయిదు సంవత్సరాల వయస్సుకు పైబడ్డవారే. అటు తరువాత ఆ నియంత రాజకీయాలలో ఒక వయస్సుకు పై బడ్డవారు అధికార పీఠాలను అధిష్ఠించరాదనే చట్టాన్ని తెచ్చాడు. ఈ ఉదాహరణ జీవితపు ఏ దశా నిరర్థకమైనది కాదని నిరూపిస్తోంది. జీవితపు ప్రతి దశకూ దాని, దాని పరమార్థాలూ, ఆనందాలూ నిక్షిప్తంగా వున్నాయి. యుద్ధంలో పోరాడుతున్న వీరుడు తన ఆత్మ బలాన్ని నిరంతరంగా కాపాడుకోవాలన్నట్లే, జీవన సమరంలో కూడా ప్రతి దశలోనూ వ్యక్తి ఆత్మబలంతో వ్యవహరించగలగాలి.



*ధనానికి హెచ్చు విలువ ఉండడానికి కారణం, మనం ధనాన్ని అధికంగా అంచనావేసే ప్రపంచంలో జీవించటమే.* - హెచ్.ఎల్. మెన్‌కెన్

# అనుపల్లవి

1. ఆత్మవంచన - వంచన కవలలు
2. జ్ఞాన సముపార్జనా మార్గం
3. కేవలం పరిస్థితులను నిందించకండి
4. మాటల వాడకం మార్చండి
5. ఆత్మన్యూనత
6. తనను అదుపు చేసుకోలేని వ్యక్తి
7. విమర్శలను రిసీవ్ చేసుకోవటం
8. స్వేచ్ఛ నుంచి పలాయనం
9. ఒంటరినని వెనుకంజ వేయకండి
10. పాజిటివ్ దృక్పథం
11. స్త్రీలు - నూతన వ్యక్తిత్వం
12. పుట్టిన స్థానం - వ్యక్తి పురోగతి
13. **Role Models** (ఆదర్శప్రాయులు)
14. సమయం లేదా ... !



# ఆత్మవంచన - వంచన కవలలు

తెలివిగా ఇతరులను మోసం చేస్తున్నామని మురిసిపోయే వారు పలువురు వుంటారు. ఈ తెలివితేటలకే వారు "ఎత్తుగడలు"గా నామకరణం చేసుకుంటారు. అలాంటి వారు ఇతరులను వంచించే ప్రక్రియలో తాము ఆత్మవంచనకు లోనవుతున్నామని విస్మరిస్తారు.

మనం తొలుత చెప్పుకున్నట్లు సమాజంలో పనిచేసే కొన్ని నియమాలు, సూత్రాలు వున్నాయి. వీటినే మనం సత్యంగా. పిలుచు కుందాం. సత్యం అనే దానికి ఈ సామాజిక నియమాలను పాటించడమే

కొలబద్ద. అంటే సత్యం నుండి దూరం కావడం అంటే సామాజిక ప్రాకృతిక సూత్రాలను ఉల్లంఘించడమే. ఈ ఉల్లంఘన సహజంగానే ఏదో ఒక రూపంలో ప్రతికూల ప్రభావాలను చూపుతుంది. ఈ అర్థంలో చూస్తే ఒక వ్యక్తి సర్వశక్తివంతుడు కావాలంటే సత్యమార్గాన్ని అనుసరించాలి. అంటే వంచనకు పాల్పడుతున్న వ్యక్తులు, ముందు తమకు తాము సామాజిక నియమాలకు వ్యతిరేకమైన ధోరణులను కలిగి వున్నట్లు. ఇదే ఆత్మ వంచన. అంటే సామాజిక సూత్రాలకు (సత్యం) దూరమైనవ్యక్తి, ఉల్లంఘిస్తున్న వ్యక్తి ఆత్మవంచనకు పాల్పడుతున్నాడు. ఈ ఆత్మ వంచనే అతనిని వంచకునిగా మారుస్తుంది.

అందుచేతనే నా వుద్దేశ్యంలో అర్థాంతరంగా ఆగిపోయిన లేదా అడ్డుకట్ట వేయబడ్డ మహామేధస్సే వంచనతో కూడుకున్న వ్యక్తిత్వం. (Cunningness is the genius halted half way through) కాగా A అన్నవ్యక్తి Z వరకూ చదవక తప్పదన్నట్లు ఒకసారి వంచనకు దిగితే, లేదా ఆత్మవంచనకు పాల్పడితే అది కడకంటా వెళ్లి ముదిరి పాకాన పడవలసిందే. ఈ కారణం చేతనే వంచన, ఆత్మ వంచన కవలలు అనేది సరైన ధృక్పధం.



జీవితాన్ని మోసం చేయడం అసాధ్యం.
జీవన సమస్యలకు వెనుక సమాధానాలు లేవు. - కిర్క్ గార్




2

# జ్ఞాన సముపార్జనా మార్గం

నేటి అడ్డద్రోవల సమాజంలో పలువురు ఏదో ఒకటో రెండో పుస్తకాలు చదివి, ఆ ఫలానా రంగంలో నిష్ణాతులు కావాలని తాపత్రయపడటం మనం చూస్తూనే ఉంటాం. చివరకు ఈ ప్రయత్నం ఫలించక వారు మొత్తం విజ్ఞాన సముపార్జననే సందేహిస్తుంటారు.

అయితే విజ్ఞాన సముపార్జన కూడా బిడ్డకు జన్మనిచ్చేందుకు తల్లి తొమ్మిది నెలలపాటు మోసి ప్రయాసపడినట్లే వుంటుంది. ఎంపిక చేసుకున్న రంగంలో దీర్ఘకాలంపాటు నిరంతర కృషి చేయకుండా ఎవ్వరికీ

సత్ఫలితాలు అందవు. తొలి ప్రయత్నాలలో అపరిపక్వంగా వున్న విజ్ఞానం, దానిని ఆచరణలో పెట్టడం ద్వారా, మరింత లోతుగా అధ్యయనం చేయటం ద్వారా పరిపక్వమవుతుంది. ఈ మొత్తం ప్రక్రియకు సహనం, ఓర్పు, కృషి అవసరం.

అలాగే విజ్ఞాన సముపార్జన ఏక బిగిన నింగివైపు దూసుకెళ్ళే రాకెట్ వంటిది కాదు. విజ్ఞాన సముపార్జనలో ప్రతి నూతన దశ వెనుకా దీర్ఘ కాలపు, గ్లామర్ లేని నిశ్శబ్ద కృషి వుంటుంది. దీని అంతిమ ఫలితంగా విజ్ఞాన ఫలం తాలుకూ పరిపక్వ ఫలాలు వ్యక్తికి అందుతాయి. ఇది నిరంతర అధ్యయనంలో వున్న వ్యక్తి జీవితంలో వుండే రెండు దశలు. వ్యక్తిలో ఈ రెండు దశలు మధ్యకాలం ఎంత తక్కువగా వుంటే ఆ వ్యక్తి ఆ రంగంలో అంత శ్రమించినట్లు, లోతులకు వెళ్లినట్లు అర్థం. ఈ విజ్ఞాన సముపార్జన ప్రక్రియ సరైన దారిలో సాగి, సత్ఫలితాల నివ్వాలంటే వ్యక్తి తాను అధ్యయనం చేసిన దానిని, లేదా తన అనుభవం లోనికి వచ్చిన దానిని గుడ్డిగా స్వీకరించరాదు. ప్రతిదానినీ సందేహించి ప్రశ్నించడం అవసరం.



విద్యా సముపార్జనా లక్ష్యం మేధస్సును మాత్రమే వికసింపచేసేదిగా ఉండాలి. సమస్యలు ఎదురైనప్పుడు నిర్ణయాలు గైకొని, తగిన తీర్పులు ఇవ్వగల స్థితిలో అది వుండాలి.

– షెర్వుడ్ యాండర్సన్






# కేవలం పరిస్థితులను నిందించకండి

పలువురు వ్యక్తులు తమ చుట్టూ వున్న మనుష్యులను, పరిస్థితులను నిందించుకుంటూ కాలం వెళ్లబోస్తారు. పరిస్థితులు కొంత మేరకు మన ఇక్కట్లకు కారణం కావచ్చు. అయితే మొత్తం తప్పంతా మన పరిస్థితులు లేదా చుట్టూ వున్న మనుష్యులపై తోసేయటం బాధ్యతా రాహిత్యం, పలాయన వాదం. ఎందుచేతనంటే పలు సందర్భాలలో మన చుట్టూ వున్న మనుష్యులు మన మానసిక స్థితి తాలూకూ ప్రతిబింబమే.

మనం ఆత్మ వంచన చేసుకుంటూ (అంటే ఇంతకు మునుపే పేర్కొన్నట్లు వంచనలో భాగం పంచుకుంటూ) మన చుట్టూ వంచకులు వున్నారని వాపోవటం తరచుగా జరుగుతుంది. కాగా పలు సందర్భాలలో మన మానసిక స్థితిని మార్చుకోవటం ద్వారా (అంటే శూన్యం నుంచి ప్రయాణం చేసే ప్రక్రియ ద్వారా) మన మానవ సంబంధాలను మనం మెరుగుపరుచుకోగలం. అలా వ్యక్తిత్వాన్ని సంపూర్ణంగా మార్చుకోవడం లేదా పరిపూర్ణం చేసుకోవడం చేయకుండా మనం మన మానవ సంబంధాలను నిజాయితీ అయినవిగా, మనం కోరుకున్న విధంగా మార్చుకోలేం.



జీవితానికి మనకు మనం విధించుకున్నవి మినహా మరే అవధులూ లేవు.
- లెస్ బ్రౌన్




4

# మాటల వాడకం మార్చండి

జీవితంలో ప్రతివ్యక్తి కొన్ని తరహాల మాటల వాడకానికి అలవాటు పడిపోతాడు. ఆ మాటలు అతనికి వరంగానూ లేదా శాపంగానూ కూడా పని చేయవచ్చు. అందుచేత తన జీవితాన్ని నిరాశావాద పదజాలంతో నింపుకున్న మనిషి, చైతన్యవంతంగా ఆ పదజాలాన్ని ఆశావహకంగా మార్చుకొనేందుకు ప్రయత్నిస్తే అతను తన జీవితంలో పెను మార్పులకు స్వీకారం చుట్టవచ్చునేది ప్రతిపాదన.

అయితే వాస్తవానికి నా వుద్దేశ్యంలో పలు సమస్యలు ఈ పరిష్కా

రానికి పూర్తిగా లొంగవు. ఉదాహరణకు డిప్రెషన్‌లో వున్న వ్యక్తి తనకు తాను బాగా ఉల్లాసంగా వున్నట్లు చెప్పుకొంటే, అతని మానసిక స్థితి తేరుకొనే అవకాశం వుంటుందనేది ఈ సిద్ధాంత వాదన. కానీ మనం ఈ పుస్తకం మొదట్లోనే చూపినట్లు వ్యక్తి మానవ సంబంధాల నెట్‌వర్క్‌లో వున్నాడు. ఈ నెట్‌వర్క్‌లో వుంటూనే పైన చెప్పిన పద విన్యాసం ద్వారా అతను తన పరిస్థితి నుంచి బయటపడలేడు. ఏతావాతా పై ప్రతిపాదనకు వ్యక్తిని ప్రభావితం చేయగల బలం చేకూరాలంటే, దానికి ముందుగా ఆ వ్యక్తి నెట్‌వర్క్ నుంచి శూన్యం ద్వారా ప్రయాణించి మొత్తం తన వ్యక్తిత్వాన్నే మార్చుకోవటానికి ప్రయత్నం చేయాలి.



> మానవుల మాటలు అర్థాన్ని సంతరించుకోవటానికి తాపత్రయపడుతుంటాయి.
>
> – గాస్టన్ బ్యాచిలర్డ్




5

# ఆత్మన్యూనత

శూన్యం గుండా ప్రయాణం చేయటంలో మనకు ప్రధాన ఆటంకంగా నిలిచేది ఆత్మన్యూనతా భావం మరియు సరైన ఆత్మవిశ్వాసం లేకపోవటం. శూన్యం గుండా ప్రయాణం చేయాలంటే మనకు ఆత్మబలం అవసరం. ఆత్మన్యూనత లేదా ఆత్మగౌరవం లేకపోవటం, ఈ ఆత్మబలం పునాదులను బలహీన పరుస్తాయి. శూన్యం గుండా ప్రయాణం చేయటంలో వ్యక్తి లోనయ్యే వంటరితనాన్ని, సంఘర్షణలనూ పట్టుకొని నిలబడటానికి తగినంత మనో స్థైర్యం, తన కాళ్లపై తాను

మానసికంగా నిలబడ గల స్వతంత్ర దృక్పథం అవసరం. అందుచేత వ్యక్తిగత పురోభివృద్ధికి గానూ; ఆత్మన్యూనతను అధిగమించటం ముందస్తు షరతు. ఈ రకంగా ఆత్మన్యూనతను అధిగమించేందుకు ఆ ఆత్మన్యూనతా భావానికి ప్రధానంగా కారణమయ్యే బాల్యంలోని అనుభవాలను పునః సమీక్షించుకోవటం అవసరం. ఈ ప్రయత్నంలో ఈ పుస్తకంలో పేర్కొనబడ్డ పలు అడ్డద్రోవ పద్ధతుల వ్యక్తిగతాభివృద్ధి సిద్ధాంతాలు కూడా కొంతమేరకు ఉపకరిస్తాయి. అయితే ముందే పేర్కొన్నట్లు లోతయిన అధ్యయనం లేకుండా పరిపూర్ణ ఆత్మ విశ్వాసాన్ని సాధించడం అసాధ్యం.



నిన్ను నీవు తప్ప, మరెవ్వరూ అవమానించలేరు.

\- హెన్రీ వీలర్ షా



6

# తనను అదుపు చేసుకోలేని వ్యక్తి

స్వీయ నియంత్రణ లేదా తనను తాను అదుపు చేసుకొనే (self control) లక్ష్యం లేని వ్యక్తి ఇతరుల అదుపులో ఉంటాడని ప్రఖ్యాత జర్మన్ తత్వవేత్త నీషే పేర్కొంటాడు. అంటే స్వీయ నియంత్రణ లేని వ్యక్తి తాత్కాలిక తక్షణ ప్రయోజనాలకై జీవిస్తూ తన చుట్టూ వున్న పరిస్థితులపై అదుపును కోల్పోతాడు అంటే మనం ఈ పుస్తకంలో ముందే పేర్కొన్న విశృంఖల స్వేచ్ఛావాద ప్రభావంలో పడి తన భవిష్యత్తును అంధకారమయం చేసుకుంటాడు. అందుచేత స్వీయ నియంత్రణ అంటే

ఇక్కడి అర్థం ఏవో గుడ్డి, అశాస్త్రీయ విలువల ఆధారంగా తనకు తాను మానసికంగా సంకెళ్ళు బిగించుకోవటం కాదు. స్వీయనియంత్రణ అంటే సామాజిక నియమాలను అర్థం చేసుకొని, వాటి పరిధిలో పని చేస్తూ వుండటమే.

నేటి సమాజంలో 'స్వీయ నియంత్రణ'కు సంబంధించిన విషయంలో మనం రెండు భిన్న ధృవాల యువకులను చూడవచ్చు. యౌవనంలో తాత్కాలిక ఆవేశాలలో దూరదృష్టి లేకుండా కాలక్షేపం చేసి తమ జీవితాన్ని బలి చేసుకునే వారు ఒక తరహావారు.

కాగా ఇక మరో తరహావారు స్వీయ నియంత్రణతో సంకుచిత స్వార్థ ప్రయోజనాలను జోడించి జీవితంలో పై పైకి రావాలని తాపత్రయ పడేవారు. ఈ రెండవ కోవలోని వారు కూడా తాము సంఘజీవులమనీ, తాము జీవిస్తున్న సమాజానికి కొన్ని శాస్త్రీయ సామాజిక సూత్రాలు ఉన్నాయనీ విస్మరించిన వారు. అంటే వారు వ్యక్తిగత వాద పోకడలతో తాము జీవితంలో సాధించింది, సాధిస్తోన్నది కేవలం తమ వ్యక్తిగత ప్రతిభ అని భావించుకొంటూ, సమాజంలోని పరస్పర ఆధారతను గుడ్డిగా తిరస్కరిస్తున్న వారు. ఇటువంటి వారు జీవితంలో పైకి రావటం పేరుతో డబ్బును సంపాందించవచ్చు. అయితే శాస్త్రీయ సామాజిక నియమాలను ఉల్లంఘించి, తమ స్వార్థ ప్రయోజనాలకు ఇతరులను పనిముట్లుగా చూసే ఇటువంటి వారు పరిపూర్ణ మేధో వికాసాన్ని గానీ, జీవిత విజయాలను కానీ సాధించలేరు. దీనికి ఒక ఉదాహరణగా రోగి పల్స్ (నాడిపై) కాక, పర్సుపై చెయ్యి ఉంచే డాక్టరు అటు కీర్తిని, ఇటు డబ్బును కూడా పరిపూర్ణంగా సాధించలేడని మనం గుర్తించాలి. అందుచేత పుస్తకంలో ముందే పేర్కొన్నట్లు వ్యక్తి తన మేధో సంపదను సమాజానికి ఉపయోగపడే విధంగా మలచినప్పుడు మాత్రమే అతను లేదా ఆమె పూర్తి వికాసాన్ని సాధించగలరు.




7

# విమర్శలను రిసీవ్ చేసుకోవటం

విమర్శ అనగానే వులికిపడేవారు, భూజాలు తడుముకొనే వారు మన మధ్య చాలా మంది వుంటారు. ఇక ఇలాంటి వారు ఆత్మ విమర్శ జోలికే పోరు. అయితే విమర్శ చేసే ఎదుటి వ్యక్తి మన శ్రేయోభిలాషేనన్న మౌలిక విశ్వాసం వున్నప్పుడు ఆ విమర్శను రిసీవ్ చేసుకోవాలి. దీని అర్థం విమర్శను గుడ్డిగా ఆమోదించుకొని ఆత్మ న్యూనతకు లోనవ్వమని కాదు. కావలసిందల్లా విమర్శను తన జీవిత అనుభవాల నేపథ్యంలో సమీక్షించుకోవటం. విమర్శ సరైనదని గోచరిస్తే

ఆత్మవిమర్శ ద్వారా తనను తాను సంస్కరించు కోవటం. ఇలా చేయటం వలన లాభపడేది ఆత్మ విమర్శ చేసుకుని లోపాలను సరిదిద్దు కొన్న వ్యక్తే. అంటే లోపాలను సరిదిద్దుకొన్న అనంతరం ఆ వ్యక్తే అంతకు మునుపటి కంటే మరింత శక్తివంతుడవుతున్నాడు. అందుచేత ఇతరులనుంచి వచ్చే సద్విమర్శలు మన అభివృద్ధికి సోపానాలు. అలాగే మనం ఎదుటివారిని విమర్శించటంలో కూడా జాగ్రత్త వహించాలి. ఏ వ్యక్తినీ అతని పరోక్షంగా విమర్శించకూడదు. దీనివల్ల మీరు ఎవరివద్ద అయితే ఆ వ్యక్తిని విమర్శిస్తున్నారో వారివద్ద కూడా విశ్వసనీయతను కోల్పోయే ప్రమాదం వుంది. వేరే వ్యక్తిని అతని పరోక్షంలో విమర్శించిన వ్యక్తి, నేను లేనప్పుడు నన్ను మాత్రం విమర్శించడని గ్యారంటీ ఏమిటనే సందేహం కించిత్తు ఆలోచన వున్నవారికి ఎవరికైనా కలుగుతుంది. ప్రత్యక్షంగా ఒక వ్యక్తిని విమర్శించటం ఒక్కోమారు తాత్కాలికంగా హానిచేసినా, దీర్ఘకాలంలో అది మీ విశ్వసనీయతను, విచక్షణను నిరూపిస్తుంది.



ఏదైనా సాధించాలనుకున్నప్పుడు శ్రమించే భావం వుండాలి. విమర్శలను ఎదుర్కో సహనం వుండాలి. - బెట్ డేవి




**8**

# స్వేచ్ఛనుంచి పలాయనం

మానవుడు సామాజిక నియమాలకు లోబడిన స్వేచ్ఛా జీవి. అంటే ఆతను జీవితంలో సాధించే దానికి లేదా కోల్పోయేదానికి కూడా అతనే బాధ్యుడనేది సార్త్ర్ వంటి అస్థిత్వవాదుల సూత్రీకరణ. అంటే మానవునికి సహజ వరప్రసాదమయిన ఈ స్వేచ్ఛ, ఆతనిపై స్వీయ నిర్ణయాధికార బాధ్యతనూ, భారాన్నీ మోపుతుంది. దీని అర్థం పలు సందర్భాలలో మానవుని స్వేచ్ఛే, ఆతనికి భారమవుతుంది. అందుచేతనే ఈ స్వేచ్ఛను భరించలేని పలువురు తమ స్వీయ నిర్ణయాధికారాన్ని ఇతరులకు

పాదాక్రాంతం చేస్తారు. తద్వారా వారు సమాజంలోని అన్ని పెడధోరణులకు కొందరి నియంతృత్వ పోకడలకు కారణమవుతారు. కాబట్టి వ్యక్తిగత పరిణతి కోరుకునే వారెవరైనా స్వీయ నిర్ణయాధికారాన్ని కాపాడుకోవాలి. సమాజంలో బాధ్యతగా వ్యవహరించాలి. ఇదే కాకుండా మన వ్యక్తిత్వ అభివృద్ధినీ, పరిణితినీ కూడా మన సామాజిక చట్రం నిర్దేశిస్తుందని దృష్టిలో ఉంచుకోవాలి. ఈ విషయంలో ఎరిక్ ఫ్రామ్ అనే అమెరికా మానసిక, సామాజిక శాస్త్రవేత్త రచనలు చదవటం ఉపకరిస్తుంది. ఆయన రచనలలో ముఖ్యమైనవైన : "ఎస్కేప్ ఫ్రమ్ ఫ్రీడమ్", "ది సేన్ సొసైటీ", "టుబి ఆర్ టు హేవ్" వ్యక్తిత్వ వికాసాన్ని కోరుకునే అందరూ చదివి తీరవలసినవి.



ఇబ్బందికరమైన ప్రశ్నలేవీ ఉండవు.
ఇబ్బందికరమైన సమాధానాలే వుంటాయి.




9

# ఒంటరినని వెనుకంజ వేయకండి

మీకు విశాల మనోభావాలూ, పెద్ద ఆదర్శాలూ ఉంటే ఆ ఆదర్శాలను ముందుకు తీసుకపోవటంలో మీరు ఒంటరినని భావిస్తున్నారా? మీలాంటి వారు సమాజంలో చెదురుమదురుగానైనా సరే చాలామంది ఉండి తీరుతారు. కాగా ఆదర్శాల కోసం మీ ఒంటరి ప్రయత్నం తక్షణం సత్ఫలితాలను ఇవ్వకపోవచ్చు. అయితే దీర్ఘకాలంలో మీ కృషి తాలూకూ ప్రభావం మీ చుట్టూ వున్న సమాజంపై తప్పక పడితీరుతుంది. మీరు కృషి చేయటం ఆరంభించిన వెంటనే, ఇతరులనుంచి ప్రతిస్పందన

లేదా సహకారం లభించకపోవచ్చు. అయితే దీర్ఘకాల నిరంతర, క్రమ శిక్షణతో కూడిన కృషి ద్వారా మీరు మీ లక్ష్యాలను సాధించగలరు.

ఈ ప్రక్రియకు రసాయన శాస్త్రంలోని ఒక ఉదాహరణనే చూద్దాం. ఇది రసాయన శాస్త్రాన్ని అధ్యయనం చేసిన వారి కందరికీ తెలిసిందే. ప్రయోగశాలలో యాసిడ్‌ను చుక్కలు చుక్కలుగా క్రమేణా మరో రసాయనమయిన బేస్‌లో కలిపే టప్పుడు జరిగే ప్రక్రియ ఇది. యాసిడ్ తాలూకు చాలా చుక్కలు వరసగా రెండవ రసాయనంలో కలుస్తూ ఉంటాయి. అయితే ఆ రెండవ రసాయనంలో చాలాసేపటి వరకూ ఎలాంటి మార్పు గోచరించదు. తుదకు "చివరి" యాసిడ్ చుక్క పడగానే బేస్ లేదా ఈ రెండవ రసాయనపు రంగు మారిపోతుంది. దాని అర్థం ఆ చివరి చుక్క ఒక్కటే ఈ రసాయనపు రంగు మార్పుకు కారణమని కాదుగదా? యాసిడ్ నుంచి పడ్డ ప్రతి చుక్కా ఈ రసాయనపు రంగు మార్పుకు పునాదులు వేస్తూ వచ్చింది.

కాబట్టి ఉన్నత ఆదర్శాలు కల యువకులు కూడా తమ ఆదర్శాలు నిరర్థకమని భావించరాదు. వారి ఆదర్శాల ప్రభావం సమాజంలో గుణాత్మక మార్పుకు దీర్ఘకాల ప్రాతిపదికన దోహదపడుతుంది.



చుట్టూ వున్న చీకటిని తిడుతూ కూర్చోవడంకన్నా, చొరవచేసి చిరు క్రొవ్వొత్తిని వెలిగించటం మేలు. - సామెత




10

# పాజిటివ్ దృక్పథం

గతంలోని వ్యక్తిత్వ అభివృద్ధి సాహిత్యం అంతా వ్యక్తులు జీవితంలో విజయం సాధించాలంటే పాజిటివ్ (ఆశావహ) దృక్పథాన్ని అలవరచుకోవాలని సూచిస్తూ వచ్చింది. అయితే నేటి పాశ్చాత్య వ్యక్తిత్వ అభివృద్ధి సాహిత్యంలో ఈ అంశానికి సంబంధించి కొంత మార్పు వచ్చింది. అంటే వాస్తవ జీవిత పరిస్థితులను మసిపూసి మారేడుకాయ చేసుకుని లేనిపోని సందర్భాలలో కూడా పాజిటివ్ ధృక్పథం అనుసరించవలసిన అవసరం లేదనేది పలువురి వాదన. కాగా ఈ

వాదన నిరాశావాదానికి సమర్థన కాదు. వ్యక్తి తన వ్యక్తిగత జీవితంలో ఎదురయ్యే ఒడిదుడుకులను ఎదుర్కోవటంలో భవిష్యత్తుపై ఆశావహ దృక్పథంతోనే ఉండి తీరాలి. అయితే తన చుట్టూ ఉన్న సమాజం, మనుష్యులను అంచనా వేయటంలో అతను వాస్తవిక వాదిగా ఉండాలి. సమాజం పరిస్థితులు కఠోరంగా ఉన్నప్పుడు కూడా, అవి చాలా బాగున్నాయి అన్నట్లు ఇంద్ర ధనస్సు రంగులలాగా చూడరాదు. అంటే వ్యక్తిగత జీవిత పయనంలో అశావహ, సామాజిక పరిస్థితులను అర్థం చేసుకోవటంలో హేతుబద్ధ, వాస్తవిక దృక్పథంతో వ్యవహరించగలగాలి. అలా కాకుండా అన్నింటిలోనూ, అందరిలోనూ మంచినే (Positive) చూడాలనుకునే వ్యక్తి ప్రస్తుత పోటీ ప్రపంచంలో మోసానికీ, దగాకు బలవుతాడు. అందుచేత ఏ నూతన వ్యక్తితో నయినా పరిచయంలో వ్యక్తి అటు పాజిటివ్ లేదా ఇటు నెగిటివ్ దృక్పథంతో కాక ఏ పరిణామాన్ని అయినా, వాస్తవాన్ని అయినా స్వీకరించగల వాస్తవిక దృక్పథాన్ని మరియు Open mind ను అనుసరించాలి.




రాత్రింబవళ్లు నన్ను వేధించే పత్రికల మధ్య నేను కనీసం నవ్వకపోతే, మరణించవలసి వుంటుంది.
- అబ్రహాం లింకన్




11

# స్త్రీలు - నూతన వ్యక్తిత్వం

నేడు మనం స్త్రీ విముక్తి ఉద్యమాల యుగంలో జీవిస్తున్నాం. స్త్రీ విముక్తిని బోధిస్తూ పుంఖానుపుంఖాలుగా సాహిత్యం వెలువడింది. వెలువడుతోంది. కాగా వాస్తవ జీవితాన్ని గమనిస్తే నిజానికి స్త్రీలు విముక్తి అయిన పాళ్ళు చాలా తక్కువ. దీనికి స్త్రీ విముక్తి పట్ల సమాజంలో ఏర్పడిన వక్రధోరణులు, భాష్యాలే కారణం. స్త్రీ విముక్తిని కేవలం శారీరక సౌఖ్యాల పరిధికే కుదించిన ఒక తరహా స్త్రీ వాదం దీనికి మూలం - వాస్తవానికి ఈ తరహా స్త్రీ వాదం స్త్రీలను పురుషులకు

మరింత బానిసలుగా కట్టిపడవేస్తోంది. శతాబ్దాలుగా స్త్రీల మనస్సులకు, మేధోసంపత్తికి వేయబడ్డ సంకెళ్లను తెంచకుండా నిజమయిన స్త్రీ విముక్తి అసాధ్యం. నేటి యువతరం స్త్రీలు ఈ వాస్తవాన్ని గుర్తించాలి. అంటే వారు సమాజంలో కేవలం సెక్స్ సింబల్స్‌గా ఉండే పరిస్థితిని తిరస్కరించాలి. విముక్తి చెందటం అంటే వేషభాషల్లో మార్పుకాదని, అది మానసిక ఔన్నత్యానికి, వ్యక్తిత్వానికి సంబంధించిన దనేది నేటితరం స్త్రీలు గుర్తించాలి.

సమగ్ర అధ్యయనం, స్వతంత్ర వ్యక్తిత్వంతో అన్ని రంగాలలోనూ పురుషులకు తాము ఏమీ తీసిపోమని నిరూపించాలి. అలా కాని పక్షంలో పురుషాధిపత్యం సృష్టించిన సమాజంలో వారు వ్యక్తిగత స్వేచ్ఛాభ్రమల క్రింద బ్రతుకుతున్న తోలు బొమ్మలుగానే మిగిలి పోతారు. దీపం చుట్టూ తిరిగే శలభాల్లా పురుషాధిపత్య సమాజంలో సమిధలవుతారు.



స్త్రీ విముక్తిని సాధించేందుకై స్త్రీల అణచివేతకు ప్రధాన కారణమైన వ్యక్తిగత ఆస్తిని సమూలంగా నాశనం చేయాలి. - పెరియార్ రామస్వామి నాయకర్




12

# పుట్టిన స్థానం - వ్యక్తి పురోగతి

వ్యక్తి పుట్టగానే అస్థిత్వం లేని వాడని, కేవలం ఉనికి మాత్రమే కలవాడని మనం పుస్తకం తొలి పుటలలో చూశాం. అయితే కాలక్రమేణా ఆతనికి ఒక నిర్వచనం ఏర్పడుతుందని మనం చెప్పుకున్నాం. వ్యక్తిగత పురోభివృద్ధికి ఈ నిర్వచనాన్ని మార్చుకోవటం ప్రధాన షరతు అని కూడా చెప్పుకున్నాం.

కాగా ఓ వ్యక్తి ఏ మేరకు వ్యక్తిత్వ అభివృద్ధిని సాధించగలడన్నది ఆతని నిర్వచనం, సాంద్రతపై కూడా ఆధారపడి ఉంటుంది. అంటే

బంధుత్వాలకూ, వ్యక్తిగత సంబంధాలకూ హెచ్చు ప్రాధాన్యత నిచ్చే పరిస్థితులలో ఏర్పడే వ్యక్తిత్వ నిర్వచనం ఎక్కువ సాంద్రత కలిగి, తక్కువ వెసులుబాటుతనాన్ని (Flexibility) కలిగి ఉంటుంది. అంటే ఇలా బలంగా, అధిక సాంద్రతతో నిర్వచించబడిన వ్యక్తి వ్యక్తిత్వ పురోగతిని సాధించడం మామూలు కంటే తీవ్ర కృషి ద్వారా మాత్రమే సాధ్యమవుతుంది.

నగరాలలో పుట్టిన వారు అంటే తక్కువ సాంద్రత వున్న మానవ సంబంధాలతో పుట్టిన వారు వివిధ రంగాలలో నేడు హెచ్చుగా రాణించగలగడానికి ఇది ఒక ప్రధాన కారణం. నిర్వచనం సాంద్రత తక్కువగా ఉండటం వల్ల వారు జీవితపు మలుపులలో సులభంగా అడ్జస్ట్ కాగలరు. ఆ మలుపులకు అనుగుణంగా తమలో మార్పులను చేసుకోగలరు.

అయితే నగరవాసులకు ఉన్న ఈ వెసులుబాటుతనమే ఒక్కోమారు వారి పాలిట శాపం అవుతుంది. దీనికి ఉదాహరణగా నవనాగరికత విశృంఖలంగా పెరిగిపోయిన అమెరికా వంటి దేశాలనే చూద్దాం. ఈ దేశాలలో మేథావులు ఎంత మంది పుట్టుకువస్తున్నారో; అంతకుమించి మానసిక దుర్బలులు, రోగులూ కూడా పెరిగిపోతున్నారు. దీనికి, వ్యక్తి మానసిక స్థిమితతకు అవసరమయిన కనీస మానవ సంబంధాలు ఈ నవనాగరిక సమాజంలో లేకపోవడం ప్రధాన కారణం. ఇలా మానసిక స్థిమితత లేక పసితనంలోనే, సరైన మానవ సంబంధాలను ఏర్పరచుకోలేక తమ తోటి విద్యార్థులనే తుపాకులతో కాల్చి చంపిన పిల్లల గురించిన వార్తలను మనం పత్రికలలో చదువుతూనే వున్నాం.

> మానవుడు నూతన వ్యక్తిత్వం పొందాలంటే ముందుగా అతను తన పాత అస్తిత్వాన్ని పరిత్యజించాలి. దీనికై అతను ముందుగా జాగృతుడవ్వాలి. - జార్జ్ గర్డ్ జియఫ్




13

# Role Models (ఆదర్శప్రాయులు)

శూన్యంనుంచి ప్రయాణించటంలో, తద్వారా నూతన వ్యక్తిత్వాన్ని పొందటంలో తన వ్యక్తిగత లక్ష్యాలకు అనుగుణమయిన Role models ను (ఉన్నత వ్యక్తులను) ఎంపిక చేసుకుని వారి జీవిత చరిత్రలు విస్తృతంగా చదవటం కూడా సహాయ పడుతుంది. ఇలా వారి జీవిత చరిత్రలు చదవటం వలన వ్యక్తి ఆయా ఉన్నత వ్యక్తుల మానసిక స్థితిని కొంత మేరకయినా జీర్ణం చేసుకోగలడు. తద్వారా తన వ్యక్తిత్వంలో మార్పులను ఆహ్వానించగలడు. ఇలా ఉన్నత వ్యక్తుల జీవిత చరిత్రలను

చదవటం వలన వారు తమ ఆదర్శాలను, లక్ష్యాలను ఏ రకమైన వ్యక్తిత్వ సమూనాలో సాధించారో అర్థం చేసుకోవచ్చు. తద్వారా మార్పును కోరుకుంటున్న వ్యక్తి ఆయా ఉన్నత వ్యక్తుల ఆదర్శాలతో పాటుగా, జీవిత విధానాన్ని కూడా అలవరచుకోగలడు. ఒక చిత్రాన్ని దాని బేగ్రవుండ్ లేకుండా అర్థం చేసుకోలేం. ఉన్నత వ్యక్తుల వ్యక్తిగత జీవితాలు, వారి లక్ష్యాలకు బేగ్రవుండుగా ఉంటాయి.




జీవితం ప్రతి మలుపులోనూ తమ పెద్దల ఉదాహరణల చేత చెడిపోతున్న యువతరంతో మనం భూతల స్వర్గాన్ని సృష్టించలేం. – ప్లేటో




14

# సమయం లేదా... !

ఈ బిజీ బిజీ ప్రపంచంలో అసలు దైనందిన రొటిన్‌కే సమయం చాలకుంటే ఇక ఈ శూన్యం నుంచి ప్రయాణంకోసం కృషి, అధ్యయనం ఎలా సాధ్యం అని మీరు ప్రశ్నించవచ్చు. అయితే దీనికి నేను యిచ్చే జవాబు ఒక్కటే. మీరు రోజులో కేవలం పదిహేను నిమిషాలు అధ్యయనానికి కేటాయిస్తే (బస్టాపులో వెయిటింగ్‌లో అయినా సరే) సంవత్సరానికి హీనపక్షం పదిహేను పుస్తకాలు చదవగలరు. అధ్యయానికి ఈ మాత్రం ప్రాధాన్యత కూడా ఇవ్వలేము అనుకోవడం సోమరితనానికి,

జడత్వానికి, రాజీధోరణికి, ఆత్మ వంచనకు మేలిముసుగు. అంతే కాకుండా సమయాన్ని సద్వినియోగం చేసుకునే కిటుకులను నేర్చుకోవడం ద్వారా మీరు జీవితంలో ఎవ్వరూ ఊహించని వ్యక్తిగత పురోగతిని, అభివృద్ధిని సాధించగలరు. కాలంలో కూరుకుపోయి ఆ క్షణానికి తనముందు ఉన్న సమస్యనే అత్యధిక ప్రాధాన్యత కలదిగా భావించుకుంటూ దానితో మల్లగుల్లాలు పడటం తెలివైన వ్యక్తి చేసేపని కాదు. సమయాన్ని వినియోగించుకోవటంలో తన జీవిత దీర్ఘకాలిక లక్ష్యాలను, తన ముందున్న తక్షణ సమస్యలతో బేరీజువేసుకొని వ్యవహరించటం ప్రధాన అంశం.



ఎవరైనా ఒక వ్యక్తి ఏ విషయంలో క్షణం తీరిక లేకుండా ఉన్నాడో చెబితే ఆ వ్యక్తి ఏ కోవకు చెందినవాడో, ఎలాంటివాడో ఇట్టే పసిగట్టవచ్చు. - గేయిక్

# వెయ్యిమైళ్ళ ప్రయాణం ...



ఇక సుదీర్ఘ జీవిత ప్రయాణంలో చివరకు సాధించ దలచిన అత్యున్నత ఫలితాల భారీ స్థాయికి (Magnitude) భయ పడి అస్త్ర సన్యాసం చేయటం మరింత అమాయకత్వం. వెయ్యి మైళ్ళ ప్రయాణమయినా మన కాలి క్రిందే ప్రారంభమవుతుందన్న నానుడిని మనం ఇక్కడ నిరంతరం గుర్తుంచుకోవాలి. అంతిమ లక్ష్యం స్థాయికీ, దాని దిశగా జరిగే ప్రయాణ ప్రయాసకీ భయపడి జీవిత విజయాలను చేజార్చుకోవద్దు. మీ లక్ష్యాల వైపు ప్రయాణానికి ఏదో ఒక శుభ ఘడియకై ఎదురు చూడవద్దు. ఈ జీవితం నాది, ఈ క్షణం నా సొంతం, గతం చెల్లని ప్రామిసరీనోటు. భవిష్యత్తు పోస్ట్ డేటెడ్ చెక్ వంటిది అని గుర్తించి, వర్తమానంలో పరిపూర్ణంగా మమేకం కండి. వర్తమానంలో మీరు వేసే అడుగు దానంతటదే మిమ్మలను భవిష్యత్తులోని (రేపటి వర్తమానం) తరువాతి అడుగుకు నడిపిస్తుంది. అందుచేత నూతన సహస్రాబ్ది ముంగిటిలో శతసహస్ర బాహావులతో నవనవోన్ముఖ వ్యక్తిత్వంతో జీవితపు శిఖరాలను చేరేందుకు, ఆకాశానికి ఎదిగేందుకు ఈ క్షణమే శుభ ముహూర్తం.